# తెలుగువారి తొలి పండుగ ఉగాది

— కొమరగిరి జయప్రభ

తెలుగుదనం నిండుగా దండిగా వెలుగొందిన తొలి పండుగ ఉగాది. శిశిరంలో ఆకులు రాల్చి మోడు వారిన ప్రకృతికాంత తన చెలికాడైన వసంతుడు రాకతో నిలువెల్లా పులకరించిపోతుంది ఎక్కడ చూసినా రంగు రంగుల పూలబాలలు చిరునవ్వుతో స్వాగతం చెపుతాయి. మామిడి చిగురులు తిని మత్తెక్కిన కోయలమ్మ కుహూ .... కుహూ .... అని రాగాలు తీస్తుంది చిటారు కొమ్మన చిన్న చిన్న పిందెలను కొరుకుతూ చిలుకమ్మ చెప్పే చిట్టి చిట్టి పలుకులు ; చిలుక, కోయిల రంగు రూపులు వేరే అయినా వాటి స్నేహం, బంధం ఈనాటిదా? అది ఏనాటిదో ? వారికి ఉన్న స్నేహ ప్రేమ భావాలు మనలో ఉన్నాయా ? అని మనం ఒక్కసారి ఆలోచించు కోవాలి ఇది వసంత ఋతువు. ఎటు చూసినా ఒయ్యారా లను ఒలకబోస్తూ వస్తుంది వసంతలక్ష్మి 'యువ' నామ సంవత్సరపు మొదటిరోజు, చైత్ర శుద్ధ పాడ్యమి, ఉగాది పండుగ ఆనాటి కాళిదాసాది మహా కవులనుండి ఈనాటి ఆధునిక కవుల వరకు వసంతఋతువును వర్ణిం చని కవి లేడంటే అతిశయోక్తి కాదు. ఋతువులలో వసంత ఋతువును నేనే అన్నాడు భగవంతుడు మనిషి యొక్క మంచి చెడ్డలతో నిమిత్తము లేకుండా కాలము గడచిపోతూనే ఉంటుంది మానవ జీవితంలో సంభ వించే ఒడిదుడుకులకు కారణం వాని యొక్క సంకల్ప వికల్పాలు మాత్రమే అందులో భగవంతుని ప్రమేయం ఏమాత్రం లేదు. "మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అన్నారు. మనిషి ఎన్నో ఉగాదులను జరుపుకుంటున్నాడు పండుగ పేరున క్రొత్త బట్టలను ధరిస్తున్నాడు. పిండివంటలను తింటు న్నాడు కానీ పాత వాసనలను, అహంకార మమకారము లను అసూయా ద్వేషాలను మాత్రం వదలటం లేదు. బాధపడేటప్పుడు అయ్యో ! అనటమే కాని నివారణో పాయం ఆలోచించటం లేదు. కాని కాలం ఎవ కోసం ఆగదు. కాలం భగవస్వరూపం, అందుకే "కాలాయ నమః కాల కాలాయనమః" అన్నారు భగవంతుణ్ణి రాత్రి, పగలు, రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు ఒక క్రమ పద్ధతిలో వెళ్ళిపోతూనే ఉన్నాయి అందుకే 'ప్రకృతి మనకు ప్రథమ గురువు' అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు. మనిషి జీవితం శాశ్వతం కాదు. ఒక సంవత్సరం గడచినదంటే జీవితం అనే పుస్తకంలో ఒక పేజీ వెనక్కు పోయినట్లే అని గుర్తిం చాలి. శాశ్వతమైన ఆనందంకోసం అన్వేషించాలి

భావనామ సంవత్సరంలో మలినమయిన భావనలను వదలి సద్భావనలతో 'యువ' నామ సంవత్సరంలో ప్రవేశించాము ఈ నూతన సంవత్సరాదినాడు మనము ఒక ప్రతిజ్ఞ చేసుకోవాలి. సత్ చింతనలను పెంచుకో వాలి, సన్మార్గంలో నడవాలి, పరోపకార బుద్ధిని అలవరచుకోవాలి. జీవితంలోని కష్టసుఖాలను సమ భావంతో స్వీకరించాలి షడ్రుచుల సమ్మేళనమైన ఉగాది పచ్చడి మనకు ఇచ్చే సందేశం అదే. అందుకే మన పూర్వీకులు ప్రతి పండుగలోను ఒక ప్రత్యేక మయిన అంతరార్థాన్ని గుర్తించి ఆచరించి ఆనందించి మనకు అందించారు. దానినిమనం గుర్తించి గౌరవించి అందులోని ఆనందాన్ని అనుభవించాలి. ప్రకృతిలో జరిగే వైపరీత్యాలకుగాని, రాజకీయకల్లోలాలకుగాని, నిత్యము జరిగే అరాచకాలకుగాని, మన ప్రవర్తనే కారణం అని గుర్తుంచుకోవాలి ప్రవర్తనలో మార్పు రానంతకాలం జరుపుకొనే పండుగలన్నీ దండుగ ఖర్చులే, కాబట్టి మన ప్రవర్తనను సరిదిద్దుకొని మనం మన కుటుంబమే కాక " లోకా స్సమస్తాః సుఖినో భవంతు " అనే భావనలను ఈ శుభ సందర్భంలో పెంపొందించు కుందాము. అప్పుడే మనము ఉగాది పండుగ జరుపు కున్నందుకు ఒక అర్థమూ పరమార్థమూ ఏర్పడుతుంది. 'సర్వే జనా సుఖినోభవంతు'.



ఏప్రియల్ 1995
సంపుటి : 11
సంచిక : 4

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడుపేట
మచిలీపట్నం - 521 001
ఫోన్ : 22818

| | | |
|---|---|---|
| విడి ప్రతి | : | రు. 4-50 |
| సంవత్సర చందా | : | రు. 54-00 |
| 4 సంIIల చందా | : | రు. 200-00 |
| జీవిత సభ్యత్వం | : | రు. 600-00 |
| పోషకులు | : | రు.1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM
Phone : 21137

Despatched on 7-4-1995

## విషయ సూచిక



ముఖచిత్రం : 'సాహితీవేత్త' రాహుల్ సాంకృత్యాయన్.

# మానవతావాది, సాహితీవేత్త
# రాహుల్ సాంకృత్యాయన్

భరద్వాజ్

ప్రఖ్యాత చరిత్రకారుడు కాశీ ప్రసాద్ జైస్వాల్ 'రాహుల్ సాంకృత్యాయన్' ని బుద్ధునితో పోల్చారు. "ఒకచోట కలకాలం నిలచిపోకు! నిరంతరం గమనశీలివి కమ్ము" అనేదే ఆయన జీవిత ఆదర్శం. ఎక్కడో ఒకచోట ఉండి సామాన్య గృహస్థుడిగా జీవితాన్ని వెలిబుచ్చాలని ఆయన ఎప్పుడూ కోరుకోలేదు. ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి ఒక భాష నుంచి మరొక భాషకి, మానవ సంబంధమైన విజ్ఞానఅన్వేషణలో ఒక రంగంనుంచి,మరొక రంగానికి ఆయన నిరంతరం పరిక్రమిస్తూ ఉండేవారు ఏదో మూట కట్టుకోవాలని, ఎక్కడో కొలూని నిలవాలని ఆయన ఎప్పుడూ ప్రయత్నం చేయలేదు. జ్ఞానాన్వేషణ ఆయన జీవిత లక్ష్యం.

ప్రాథమిక పాఠశాలలో ఉర్దూ భాష నేర్చుకొనే సమయములో 'నవ జింద బజింద' వ్రాసిన "ఖుద్రాయ్‌కా నతీజా" అనే కథలోని ద్విపద గీతిక ఆయన పసిహృదయాన్ని ఎంతగానో ఆకర్షించింది. దానిని ఆయన చాలాసార్లు తన ఆత్మకథలో పేర్కొనినారు. దాని తర్జుమా ఇది.

"ఓ అజ్ఞానీ, ఓ సోమరీ!
ఈ విశాల విశ్వాన్ని సందర్శించిరా!
లభించదు మరో జీవితం దీనికోసం
కలకాలం జీవించినా తిరిగిరాదు
నవయౌవన మధుమాసం!"

అని అనేకచోట్ల తన ఆత్మకథలో వ్రాసుకున్నారు. ఈ గేయ భావన ఆయన జీవితానికి స్ఫూర్తినిచ్చింది.

మరొక పర్యాయం "ఏదీ శాశ్వతం కాదు" అని బుద్ధభగవానుడు తెలిపిచ్చాడని చెబుతూ రాహుల్ 'ఏ వ్యక్తి సంపూర్ణ మానవుడు అని నేను విశ్వసించను. సత్యంపై సర్వాధికారాలు నాకు లేవు. నాకు చేతనైనది నేను చేస్తాను. భావి తరాల వారు నేను చేసిన పనిని ఉన్నత శిఖరాలకు తీసుకొని వెళ్ళుతారని నేను ఆశిస్తాను' అని అంటారు. ఈ మాటలు సామాన్యమైనవికావు. ఆయన నిరాడంబరతను బహిర్గతం చేస్తాయి. అంతే కాదు తాను చేబట్టిన కార్యం యెడల ఆత్మవిశ్వాసాన్ని బహిర్గతం చేస్తాయి.

ఆయన దయాశీలి, అనురాగమూర్తి, విగ్రహంతో, క్రమశిక్షణతో ఆయన తన కార్యక్రమాలను నిర్వర్తించుకొనే వారు. రోజుకి 18 గంటలపాటు పనిచేసేవారుట. వ్యక్తిగతమైన కోరికలకు, వినోదకాలక్షేపాలకు ప్రాధాన్యత నిచ్చేవారు కాదు. వేషధారణ అతి నిరాడంబరం. నిర్మొహమాటంగా, నిర్భయంగా ఎంత గొప్పవారినైనా, ఎంత పలుకుబడి గలవారినైనా విమర్శించడానికి ఏమాత్రం వెనుకాడేవారు కాదు. తనకు తెలిసిన సత్యాన్ని ఏమాత్రం సడలనీయకుండా, నిష్కర్షగా వెల్లడించేవారు. ఆయన తన రచనలలో తీవ్రతను వెల్లడించినా, ఆయన మృదుభాషి, మితభాషి కావటం ఆశ్చర్యం. ఆయనకు 84 భాషలలో పాండిత్యం ఉన్నప్పటికీ తన రచనా వ్యాసంగాన్ని మాత్రం ఎక్కువ భాగం సంస్కృతం

లోనూ, హిందీలోనూ సాగించారు. రచనల్లో అతి సులభమైన, సరళమైన భాషను ఉపయోగం చేశారు. సామాన్యపాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొని రచనలు చేసేవారు. బుద్ధ భగవానుని 'కరుణ' సిద్ధాంతములను అధ్యయనం చేసిన తరువాత, ఆయనలో అంతర్వాహినిగా ఉన్న సానుభూతి, సాహిత్యం పైబడి పాఠకుల మనస్సులపై చెరగని ముద్రవేసింది. అన్వేషణలో ఒక వినూత్నమైన సమదృష్టిని సాధించగలిగారు. రాహుల్ ఊహాజీవికాదు, నిరాశావాది అంతకన్నా కాదు. యదార్థవాది. హేతుబద్ధంకాని విశ్వాసాలకు ఆయన అంకితం కాలేదు. మానవతా దృష్టితో పరిస్థితులను సమీక్షించి, అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించేవారు. ప్రతి విషయంలోను ఏదో ఒక మంచినిచూడటానికి ప్రయత్నించేవారు. పరిశీలన, పరిశోధనలు ఆయన స్వభావాలు. ఒక్క మాటలో చెప్పాలంటే మానవతావాది 'రాహుల్'.

రాహుల్ అసలు పేరు కేదారనాథ్ పాండె. ఆయన 1893 సం ఏప్రియల్ 9 న జన్మించారు. ఆయన తండ్రి గోవర్ధన పాండె, తల్లి కులవంతి. ఉత్తరప్రదేశ్‌లోని అజమ్‌ఘర్ జిల్లాలోని 'పందాహ' గ్రామంలో జన్మించాడు. చిన్న వయస్సులోనే జ్ఞానాన్ని అన్వేషిస్తూ ఇల్లొదించివెళ్ళిపోయాడు. పదేళ్ళయినా రాకముందే వారణాసి వెళ్లాడు. సంస్కృతం కొంత అధ్యయనం చేశాడు. కొందరు భిక్షువులతో కలిసి హిమాలయ పర్వత ప్రదేశాలలో పర్యటించాడు. యావత్ భారత దేశం సందర్శించాడు. 1923 లో నేపాల్, 1927 లో శ్రీలంక పర్యటించాడు. "బాబారామ్ ఉదార్ దాస్" గా పేరు మార్చుకొని ఆర్యసమాజ్‌లో చేరాడు. తరువాత బౌద్ధమత గ్రంథాలను చదివి 'మహాపండిత' 'త్రిపీటకాచార్య' బిరుదులను కూడా పొందాడు. బౌద్ధం స్వీకరించిన తరువాత 'రామ్ ఉదార్ దాన్' పేరును మార్చుకొని 'రాహుల్ సాంకృత్యాయన్' పేరు పెట్టుకన్నారు. ఈ పేరే ఆయనకు చిట్టచివరిపరకు సార్థకనామమైనది. 1932 లో ఐరోపాఖండం సందర్శించారు. తరువాత రష్యా వెళ్లారు. ఆయన "మధ్య ఆసియా చరిత్ర" అనే గ్రంథమును రెండు సంపుటాలుగా వెలువరించారు. ఈ గ్రంథం వలన వీరికి 1958 లో హిందీ కేంద్ర సాహిత్య అకాడమీవారు బహుమతినిచ్చారు. ఆయన జీవితమంతా పర్యటనలలోనే నడచింది. ఆ నిరంతర పర్యటనలను ఒక తత్త్వ శాస్త్రంగా రూపొందించి 'ఘుమక్కడ్ శాస్త్ర' (సంచార శాస్త్రం) అనే గ్రంథమును వెలువరించారు.

భోజపురి భాషలో విదేశీయుల పరిపాలనపట్ల తీవ్రమైన అసంతృప్తిని వెల్లడిచేస్తూ ఉపన్యాసాలు యివ్వటం వలన ది 31-1-1922 న అరెస్టు చేయబడ్డారు. కారాగారంలోనికి రహస్యంగా 'ట్రాట్స్కీ' రచించిన "బోల్షివిజమ్-ప్రపంచ విప్లవం" అనే గ్రంథమును తెప్పించుకొని చదివారు. ఈ క్రింది రాజకీయ భజన గీతాన్ని సంస్కృతంలో వ్రాసి తోటి ఖైదీలతో భజన చేయించేవారుట

"శృణు, శృణు రే పంథ్
అహ మిహ నః ఏకాకీ"

(వినుమోయి, వినుమోయి, బాటసారీ !
ఏకాకిని కాదు నేను ఏనాటికి !)

రాహుల్‌కి ఆరు నెలలు శిక్షవిధించబడింది. 'ధన్యవాదాలు' అన్నారు రాహుల్. ఆయన చేతులకు ఇనుప సంకెళ్ళు బిగించబడ్డాయి. అప్పుడు ఆయన ఇలా అన్నారు "నా రెండు చేతులకు మా తాతగారు వెండి మురుగులు తొడిగినప్పుడు కూడా, అవి చేతి సంకెళ్ళలాగానే నేను భావించాను. వీటి రెండింటి మధ్య భేదం ఏమిటంటే, ఈ ఇనుప

(తరువాయి 33 వ పేజీలో)

శ్లో॥ అహౌవా హారేవా బలవతి రిపౌవా సుహృదివా
మణౌ వా లోష్టేవా కుసుమశయనేవా దృషదివా
తృణేవా స్త్రైణేవా మమ సమదృశోయాంతుదివసాః
క్వచి త్పుణ్యారణ్యే శివశివ శివేతి ప్రలపతః ॥

సంసార లంపటంలోపడి నానావిధ కష్టాలు పడుతున్న వాడికి సంసారం మీద రోతపుడుతుంది. కాని ఏకొంచెం సుఖప్రాప్తి కలిగినా ఇంద్రియాలకు ప్రకోపం కలిగి తిరిగి సంసార వాంఛ పుట్టటానికవకాశం వుంది అంటే కష్టం కలిగినప్పుడు విసుగువల్ల క్షణికమైన వైరాగ్యం, కాస్త సుఖం కలగ్గానే, తిరిగి అభిమానం కలగటంవల్ల నిజమైన మార్పు కలిగినట్లుకాదు,

# అమృతవాణి

కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

సర్వసామ్య బుద్ధి అనేది శాశ్వతంగా కలిగినప్పుడే వైరాగ్యభావం నిలకడగా వున్నట్లు భావించాలి. భేదాభిమాన గ్రంథి పూర్తిగా సడలిపోయినప్పుడే సర్వం శివమయంగా చూడగలుగుతాడు వ్యక్తి. పరిపూర్ణ జ్ఞానం కలిగిన స్థితిలో సర్వ సమత్వం, సమదర్శిత్వం ప్రాప్తిస్తుంది. అలాంటివాళ్ళే పండితులంటే 'పండితా స్సమదర్శినః' అని అన్నదికదా గీతా సూక్తి.

ఏ గంగా తీరంలోనో ఏ పుణ్యారణ్యంలోనో భగవన్నామం చేసుకుంటూ కాలం గడిపితే ఎంత బాగుండునో కదా! ఆ స్థితి ఎప్పుడు కలుగుతుందో అని జీవన యాత్రలో ఢక్కామొక్కీలు తిని సత్యాసత్యాలు తెలుసుకొంటూ గతానికి పశ్చాత్తాపపడేవాడనుకోటం సహజం అయితే యీ భావం నిలకడగా వుండాలి. అప్పుడుగాని స్థితప్రజ్ఞుడు కాలేడు

త్రాచుపాములనైనా పూలదండలనైనా సమంగా చూడాలి. పూలదండను చూస్తే వచ్చే ప్రసన్నత విషనాగును చూస్తే వస్తుందా? సామాన్యులకు రాదు. మిత్రుణ్ణి ఏ భావంతో చూస్తామో ఆ భావం శత్రువును చూచినా రావాలి. మట్టిని చూస్తే ఔదాసీన్యమే గాని ప్రీతి కలగదుకదా! అలాగే విలువైన మణిని చూచినప్పుడు ఉపేక్షభావం కలగాలి. కలిగితే సమత కలిగినట్లే. కాని సహజంగా మట్టిమీద ఉపేక్ష మణిమీద ఆపేక్షకలగటంకద్దు. పూలపాన్పు చూడగానే ఏమనిపిస్తుంది? మెత్తగా హాయిగా పడుకోవాలి, సుఖనిద్రపోవాలని అనిపిస్తుంది. అదే కటిక నేలమీద పడుకోవాలనిపిస్తుందా? అనిపించదు ఎందుకని ఒకటి సుఖం మరొకటి దుఃఖం కనుక. అలాకాక ఆ రెంటియందు ఒకే భావన రావటం విశేషం అదే సమత్వం అందుకనే సత్పురుషులకి సమభావం వుంటుందని 'ఒకచోట నేలను బవ్వళించు నొకచో నొప్పారు పూసెజ్జపై' అంటాడు భర్తృహరి. అలాగే గడ్డిపరకలను ఎంత హేయంగా చూస్తారో అలా కామినులను కూడా చూడగలిగితే అది గొప్పే.

ఇలా సుఖదుఃఖకారకాలయిన విభిన్న వస్తువులను చూచినప్పుడు ఎలాంటి అనుకూల ప్రతికూల భావాలు, ఇష్టానిష్టాలు కలగకుండా వుంటే అలాంటివాడికి యోగం సిద్ధించినట్లే. ఈ స్థితప్రజ్ఞ లక్షణాలను చక్కగా అలవాటు చేసుకుని హాయిగా ఏ పవిత్ర అరణ్యసీమలకో వెళ్ళి భగవన్నామం చేసుకుంటూ కాలం గడుపుతూంటే యెంత బాగుండును అని ఒక మహానుభావుడనుకుంటున్నాడు.

నిజం పరికిస్తే ఈ సర్వసామ్య దృష్టి కల వ్యక్తి యెక్కడున్నా ఇబ్బందిలేదు. అరణ్యాలకుపోనక్కర్లేదు ○

శివరాత్రి సందేశం



# దృష్టిని మార్పు చేసు ! సృష్టిని మార్పు చేయలేవు!

—భగవాన్ సాయి దివ్య సందేశం

" ప్రియవాక్య ప్రదానేన
సర్వే దుష్యంతి జన్తవః
తస్మాత్ తదేవ కర్తవ్యం
వచనేకా దరిద్రతా ? "

ప్రేమస్వరూపులారా !

ప్రియమైన వాక్యమే మానవునకు అత్యంత ఆనందమును చేకూరుస్తుంది. ఇట్టి ప్రియమైన వాక్యమునకు కొదువలేదు కనుక ప్రతి మానవుడు కూడనూ ప్రియమైనటువంటి వాక్యములను ప్రపంచమునకు అందించాలి.

" అణువు కంటెను సూక్ష్మమై అణువు ఉండు
ఘనము కంటెను ఘనమై కనిపించుచుండు
అణువె ఘనముగా, ఘనమె అణువుగ నుండు
అణువె ఆత్మయై, ఆత్మయే అణువునుండు "

విశ్వమంతయు, దృశ్యగోచరమగు చరాచర ప్రపంచమంతయు, అణువుయొక్క స్వరూపములే త్రాగేనీరు, పీల్చేగాలి, వినే శబ్దము సర్వము కూడనూ అణు స్వరూపమే. పంచ భూతములు కూడనూ అణు స్వరూపమై సర్వవ్యాపకమై ఉంటున్నవి. ఇట్టి పంచభూతముల యొక్క స్వరూపమే ఈ జగత్ కనుకనే జగత్‌నే భగవత్ స్వరూపముగా ప్రాచీనులు విశ్వసిస్తూవచ్చారు. అణువును పరిశోధన చేయక అనంతకాలమైన దీనిలో అణుశక్తి పరిశోధన గావించే ఒకానొక కాలములో ఆధ్యాత్మిక తత్త్వాన్ని సరియైన రీతిలో అనుగుణం గావించుకోలేని ఒకానొక కాలములో భారతీయులు భూమిని ఆరాదిస్తూవచ్చారు భూమి యందు పంచ భూతములు సమ్మిశితమై ఉండుటచేత భూదేవి అని ప్రార్థిస్తూ వచ్చారు. రెండవది గంగాదేవి అని జలమును కూడనూ దేవునిగా విశ్వసిస్తూవచ్చారు. మూడవది అగ్నిదేవుడు. నాల్గవది వాయుదేవుడు ఐదవది శబ్ద బ్రహ్మము పంచభూతములను కూడనూ భగవత్ స్వరూపకముగా విశ్వసిస్తూ ఆరాధిస్తూవచ్చారు భారతీయుల. ఇట్టి విశాల తత్త్వమును గుర్తించుకోలేని పిజ్ఞులు భారతీయుల ఆరాధనను హాస్యాస్పదముగా చూస్తూవచ్చారు. ప్రతి అణువునకు కూడనూ ఒక స్వరూపమున్నది. కనుక ప్రపంచమునందు స్వరూపము కానటువంటిది ఎక్కడ కూడనూ మనకు కానరాదు. ఈ స్వరూపమే విగ్రహస్వరూపము.

కనుక విగ్రహారాధన సహేతుకం కాదని అనేక మతములవారు దీనిని విమర్శిస్తూవచ్చారు. విగ్రహము కానటువంటిది ఏమిటో దానిని మాత్రము వివరించలేక పోయారు విగ్రహారాధన మూఢాచారమనియు, కేవలం మూఢనమ్మకమనియు హాస్యాస్పదము గావించుకుంటూ వచ్చారే కాని, విగ్రహారాధన కానటువంటిది ఏమిటో ? ఎవ్వరూ కూడనూ చెప్పలేకపోయారు. దైవమనగా ఏదో ఒక్క ప్రదేశమునందు మాత్రమేకాక ఒకవ్యక్తి యందు మాత్రమే కాక సర్వత్రా ఉన్నాడనే సమ

తత్త్వాన్ని, సమభావాన్ని సమైక్యతను గుర్తించుకోలేక పోయారు సర్వత్రా అణుశక్తి వ్యాపించి ఉన్నదన్న విషయమును విజ్ఞులు కనిపెడుతూవచ్చారు. సమస్త భూతముల యందు కూడనూ అణుశక్తి మిళితమైనదని తెలుసుకోవడానికి 1700 సంవత్సరములు పట్టినది. కాని దీనికి పూర్వమే బాలుడైన ప్రహ్లాదుడు ఈ సత్యాన్ని చక్కగా గుర్తించినటువంటివాడు.

" ఇందుగలడందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన నందందే గలడు " అన్నాడు ఆనాడు ప్రహ్లాదుడు. కాని ఏనాడో బాలుడు చెప్పిన ఈ యదార్థమును ఈనాడు ప్రాజ్ఞులైనటువంటివారు, వైజ్ఞానులైనట్టివారు, వేదాంతులు కూడనూ సర్వత్రా ఉండిన అణుశక్తియే దివ్యమైన ఆత్మశక్తి అని విశ్వసిస్తూ వచ్చారు 'ఇది మైకు' అని దీనిని వ్రేలుతో చూపుతున్నాను మైకును చూసిన తరువాత వ్రేలుతో నీకు అవసరంలేదు. 'ఇది పువ్వు' అని వ్రేలితో చూపుతున్నాను ఈ పూవును చూచిన తరువాత వేలుతో నీకు అవసరంలేదు. అదేవిధముగనే దైవమును చూపుట నిమిత్తమై విగ్రహములు ప్రారంభమైనవి. అందని చందమామను ఆ చెట్టుపైనున్నట్లుగా వ్రేలుతో చూపుతున్నాము. చెట్టు ఎక్కడ ? చందమామ ఎక్కడ ? కాని ఈ వ్రేలు యొక్క ఆధారము చేతనే ఆ చంద్రుని చూడగలుగుతున్నాము. కనుక ఆ చూపే వ్రేలు లేకపోయినప్పుడు చంద్రుని చూడటానికి వీలు కాదు. అదేవిధముగనే దైవాన్ని చూసేంతవరకు కూడనూ విగ్రహములు అత్యవసరమే. దైవమును చూచిన తరువాత విగ్రహములు అక్కర్లేదు సర్వమూ దైవమే.

వివాహము కానటువంటి కన్య వద్దకు వెళ్ళి అమ్మా! నీకు కాబోయే భర్త ఏరీతిగా ఉంటారు ? అంటే ఏమి జవాబు చెప్పగలదు ? ఎవరో ఆ భర్త తెలియదు తెలియనప్పుడు నా భర్త ఇలా ఉంటాడు అలా ఉంటాడు అని చెప్పటానికి సాధ్యము కాదు, వివాహము అయిన తరువాతనే తనయొక్క రూపనామములు చక్కగా బోధించగలదు అదేవిధముగనే భగవంతుని ఆరాధనలు సల్పిన తరువాతనే, అర్పితము గావించుకొన్న తరువాతనే, అనుభవము చేకూరిన తరువాతనే, దైవత్వము ఇట్టిది, అట్టిది అని చెప్పటానికి సాధ్యమౌతుంది. విశ్వసించక పూర్వము, ఆరాధించక పూర్వము, అర్పితము గావించుకొనక పూర్వము దైవముఇట్టిది అట్టిదని ఎవ్వరు చెప్పగలరు? కనుకనే విగ్రహారాధన పైన విశ్వాసము అభివృద్ధిగావించుకోవాలి ఎందుకనగా సర్వమూ విగ్రహ స్వరూపమే. పరమాణువు కూడనూ విగ్రహస్వరూపమే, అణువుకు కూడనూ ఒక ఆకారముంటుండాలి ఆకారము లేనటువంటిది ఈ జగత్తులో మరొకటి లేదు.

చాలామంది ఈ జడమైనటువంటి, చైతన్య రహితమైనటువంటి నిర్జీవమైనటువంటి విగ్రహాలను ఆరాధన చేయడం ఇది మూర్ఖత్వంకాదా ? అని ప్రశ్నిస్తారు కాని ఇది అజ్ఞానముచేత అడిగే విషయములే ఈనాడు 90 కోట్లమంది భారతీయులు చైతన్యాన్ని కల్గించే జాతీయ పతాకాన్ని ఎగురవేస్తున్నారు ఈ పతాకాన్ని ఎగురవేసే నిమిత్తమై, దీనికి పూర్వము విజయాన్ని సాధించే నిమిత్తమై అనేక విధములైన కష్టములకు గురి అయ్యారు కారాగారములలో బంధింపబడి పడరానిపాట్లు పడ్డారు. కొంతమంది ప్రాణాలను కూడా త్యాగము చేశారు. ఇన్ని విధముల శ్రమలకు ఓర్చి, భరించి, సహించి ఈ విజయ పతాకమును సాధిస్తూ వచ్చారు. ఈనాడు ఆగష్టు 15 అని, జనవరి 26 అని ఈ పతాకాన్ని ఎగురవేసి దానికి అనేక విధముల గౌరవాన్ని అందిస్తున్నారు భారతీయులు. కేవలం భారతీయులు మాత్రమే కాదు వారి వారి దేశములందు, వారి వారి జాతీయ పతాకముల నెగురవేస్తూ వాటిని గౌరవిస్తున్నారు. జాతీయ పతాకములనే కాదు, కొన్ని పార్టీల యొక్క పతాకములను కూడా ఎగురవేస్తూ దాన్ని ఎంతో గౌరవిస్తున్నారు. ఈపతాకము సజీవమైనదా? దీనికేమైనా ఒక ఆకారమున్నదా ? దీనిలోనున్న శక్తి ఏమిటి ? అని విచారణ

చేస్తే దానిపైనున్న విశ్వాసమే దానికి గౌరవము. అదే విధముగనే రాతిని పూజిస్తున్నారంటే రాతిలో చైతన్యం ఉంటున్నదా? కేవలము ఇది జడమైనటువంటిది కాదా? జీవశక్తిలేని నిర్జీవాన్ని పూజించటమెందుకు? అని చెప్పేవారు ఈ సత్యాన్ని గుర్తించుకుంటే చక్కగా అర్థమవుతుంది. ఒక గజము బట్ట అనగా కేవలము దారము చేరిన బట్టను పతాకముగా ఎగురవేసినప్పుడు దీనికి విలువ ఏమి ఉండాలి? అనగా విజయాన్ని సాధించిన విజయపతాకమనే విలువ దానిలో ఉంటుండాలి. ఆ విజయమునకు రూపము లేదు. విజయాన్ని నిరూపించేదే ఈ పతాకము. కనుక పతాకము లేకుండా విజయానికి రూపు చూపించాలంటే వీలు కాదు. అదే విధముగనే ఈనాడు లోకంలో 5 అంగుళాల నూరురూపాయల నోటు ఉంటున్నది. ఈ యొక్క నూరురూపాయల నోటుకి ఏ విధమైన చైతన్యము లేదు. కాని దాన్ని ఎంత భద్రముగా దాచుకుంటున్నాం? ఈనాడు ప్రపంచంలో ధనమంటే ఆశలేనివారు కానరారు. త్యాగి మొదలు భోగివరకును, పామరుని మొదలు పరమహంస వరకును, ఈ ధనము యొక్క ఆశచేతనే సమస్త కర్మలూ ఆచరిస్తున్నారు. చదవటము ధనముకోసమే, ఉద్యోగము ధనముకోసమనే, పదవులు ధనముకోసమనే, పార్టీలూ ధనముకోసమనే, సర్వమూ ధనముకోసమనే. కాని ధనమంటే ఆశ లేనివారు లోకంలో ఎవరు? ఎవరికి ఈ ధనమనేది చేదుకాదు? కాని ఈ ధనాన్ని ఆరాధిస్తున్నారు. ఈ ధనమునకు ఏవిధమైన చైతన్యమున్నది? ధనమునకు ఏమైనా సద్గుణములున్నవా? ఈ ధనమునకు ఏమైనా ప్రేమ ఉంటున్నదా? అని విచారణ చేస్తే ఈ విధమైన గుణములకు రూపమేలేదు. అయితే అట్టి గుణములను నిరూపించేటటువంటి వ్యక్తికి రూపము ఉంటున్నది.

ఒక పుష్పముంటున్నది. చక్కని సుగంధాన్ని అందిస్తున్నది. ఈ సుగంధానికి రూపమేమిటి? అని ప్రశ్నిస్తే సుగంధమునకు రూపములేదుకాని ఆ గంధమును అందించే పుష్పానికి రూపముంటున్నది. ప్రేమకు రూపమేమిటి? ప్రేమకు రూపం లేదుకాని ప్రేమను అందించే తల్లికి రూపముంటున్నది. ఆ తల్లి లేకపోతే ప్రేమ ఎక్కడినుంచివస్తుంది? కనుకనే దైవమెక్కడ? దైవమెక్కడ? అని వాదించేవారలకు దైవాన్ని నిరూపించడానికి తగినటువంటి చిహ్నములే ఈ స్వరూపాలు. కనుక భగవంతుడనగా ఎక్కడ? అంటే సర్వ అణువునందు కూడనూ భగవంతుడుంటుండాలి. ప్రతి అణువుకూడనూ భగవత్‌శక్తి స్వరూపమే. కనుక ప్రతి అణువు కూడనూ మనం ఆరాధించవలసినదే. అన్నిటినీ గౌరవించవలసిందే. ఈ గౌరవ మర్యాదలనేవి ప్రతి మానవునికి అత్యవసరమే. కాని భౌతికమైన, లౌకికమైన, ప్రాకృతమైన దేహమే ప్రమాణము ప్రధానమని విశ్వసించి, ఇది సజీవమని విశ్వసించి, దీనియొక్క శక్తిసామర్థ్యముల నిమిత్తమై మానవుడు తనయొక్క కాలమును, కర్మమును, కాయమును కూడా వ్యర్థము గావించుకుంటున్నాడు. కాయము లేక కర్మలు కావు. కర్మలు చేయక ఫలితము రాదు. కనుకనే కాయమనేది అన్నింటికినీ మూల కారణము. కాయమనగా ఒక విగ్రహము. తల్లి ఒక విగ్రహమే. తండ్రి ఒక విగ్రహమే. గురువు ఒక విగ్రహమే. అందరూ కూడా విగ్రహాలే. కాని ఈ విగ్రహములనేవి ఒకవిధమైన విలువను అందించేవి. దానిద్వారానే మనం దైవత్వాన్ని పొందటానికి సాధ్యమౌతుంది. ఆకారము లేని ఆరాధన జగత్తులో కానరాదు. ఆకారములేని ఆరాధన కేవలం ఒకవిధమయిన మూర్ఖత్వమే. అట్టి మూర్ఖత్వము కల్గిన వ్యక్తులే ఆకారమును పూజించరాదని ఒకవిధమయిన ప్రచారము చేస్తూ ఉంటారు. సర్వమతములయందుకూడనూ ఒక్కొక్క విశ్వాసమునకు ఒక్కొక్క ఆకారముంటుంది. ఒక చిన్న ఉదాహరణము ప్రకృతి. ఈ ప్రకృతికి ఆకర్షణ శక్తి ఉంటుండాలి. ఈ ప్రకృతే పంచభూతములను కూడనూ మిళితము గావించుకుంటున్నది. ఈ ప్రకృతి ద్వారానే మనకు ఆహారము లభ్యమవుతున్నది. మానవుని నిత్య జీవితమును సంరక్షించేది ప్రకృతియే

కాబట్టి ప్రకృతిని ఆరాధించడంలో దోషమేమిటి ? మనకు సర్వమును అనుగ్రహించేదానికి కృతజ్ఞత చెప్పనవసరం లేదా ? ఆ కృతజ్ఞతే ఒక ఆరాధన ప్రతి మానవునిలో పంచభూతములు ఉంటున్నవి ఈ పంచభూతములే లేకపోతే మానవుడే కాదు, జీవుడేకాదు కనుక మనం వీటికి కృతజ్ఞత చెప్పనక్కరలేదా ? ఈ ప్రకృతికి మహా శక్తివంతమైన ఆకర్షణ ఉన్నది కనుక ఈ ప్రకృతికి సమీపించిన ప్రతి పదార్థమును కూడనూ తాను ఆకర్షిస్తుంటుంది. ఈ ఆకర్షించిన ప్రతి వస్తువునకు కూడనూ ఈ ఆకర్షణశక్తిని అందిస్తుండాలి చాలామంది వైజ్ఞానులు కూడనూ ఇప్పుడిప్పుడే దీనిని గుర్తించడానికి ప్రయత్నిస్తున్నారు. ఇక్కడొక దేవాలయమున్నది. దేవాలయము లోపల దేవుని దర్శనార్థమై వేలాదిమంది ప్రవేశిస్తుంటారు. ఈ ప్రవేశించిన తరుణంలో దీని ఆకర్షణశక్తి, ఈ భూమియొక్క ఆకర్షణశక్తి ఆ యొక్క విగ్రహములో ఉంటుండాలి వేలాదిమంది అక్కడ చేరినప్పటికీ వారిలోనున్న భావనాశక్తి కూడనూ ఆ విగ్రహము ఆకర్షిస్తుంది కనుకనే ఆ విగ్రహమునకు కూడనూ ఆకర్షణశక్తి అధికమైపోతుంది. ఆరాధన చేసే సాధకులకు కూడనూ ఆ శక్తి మరింత అధికమవుతుంది. ఎట్లనగా పది అయస్కాంతంముక్కలను ఒక దగ్గర వేసి, దానిలోపల 2 మేకులు వేసి రెండు దినములు పెట్టండి. ఆ మాగ్నట్ పవర్ ఈ మేకులకు కూడా చేరిపోతుంది అదే విధముగనే ఒక దేవాలయములో మనం ప్రవేశించినప్పుడు మన యొక్క భావనాశక్తి ఆ యొక్క విగ్రహములో ప్రవేశిస్తుంది. ఈ వేలాది, లక్షలాదిమంది యొక్క భావనాశక్తిచేతనే ఆ విగ్రహము కూడనూ మరింత శక్తివంతమవుతుంది. ఆ శక్తివంతమైన విగ్రహము అందరినీ శక్తివంతము చేస్తుంది. కనుక ఈ జగత్తునందు శక్తిహీనమైనది ఎక్కడా కానరాదు. సర్వత్రా కూడనూ అణుశక్తి ఉంటున్నది. ఇలాంటి అణుశక్తి యొక్క స్వభావ స్వరూపాన్ని గుర్తించినప్పుడే దైవత్త్వము మనకు చక్కగా అర్థమవుతుంది. శం....కర 'శం' అనగా ఏమిటి ? గాలివలే సర్వత్రా వ్యాపించేటటువంటిదే 'శం' గాలి ఏ విధంగా వ్యాపించుతుందో, ఆ విధంగా వ్యాపించడమే ఈ 'శం' యొక్క శక్తి ఆనందముతో కూడినటువంటిది ఈ గాలి. 'కర' _ దీనిని అందించేటటువంటివాడు శంకరుడు. నిత్యానందమును, సచ్చిదానందమును, బ్రహ్మానందమును అద్వైతానందమును, మహదానందమును_సర్వమునూ అందించేదే శం....కర ఆనందమును చేకూర్చేటటువంటిదే ఈ 'శంకర' అన్న పదమునకు అర్థము.

ఇక రెండవది. ఈశ్వర. 'ఈశ్వర' అనగా సకలైశ్వర్యస్వరూపుడు. ఐశ్వర్యమనగా ఏమిటి ? కేవలం ధన కనక వస్తు వాహనాదులు మాత్రమే కాదు. ఆరోగ్యము ఒక ఐశ్వర్యమే మేధాశక్తి ఐశ్వర్యమే. భుజబలమూ ఐశ్వర్యమే. కాబట్టి మానవుని యందున్న సర్వస్వమూ ఐశ్వర్యస్వరూపమే. కనుకనే 'ఈశ్వర' అనగా సకల ఐశ్వర్యములను చేకూర్చేటటువంటిది ఈశ్వరత్వము అయితే ఈ ఆనందమనేటటువంటి దానికి రూపమేమిటి ? ఈ ఆనందమనే దానికి అనుభూతే దీనికి రూపము ఈ ఆనందమనేది కేవలం ఒక్క దైవంనుండి మాత్రమే ప్రసాదింపబడుతుందిగాని అన్య మార్గములో లభ్యంకాదు. సర్వత్రా ఉండినది ఒక్క ఆనందమే కాని అది కనిపించదు, కనిపించకపోయినంత మాత్రమున లేదని వాదించరాదు కనుక ఈశ్వరత్వమనేది సర్వత్రా వ్యాపించినటువంటిది. మానవత్వములో ఇట్టి విశ్వాసములను కోల్పోయి, అవిశ్వాసరూపులై, ఆనందమునకు దూరమై, అశాంతికి దగ్గరైపోతున్నారు మానవులు. విశ్వాసములేని జీవితము జల్లెడలో పోసిన నీరు వంటిదే. కనుక విశ్వాసముచేతనే దీనిని మనం సాధించాలి. దైవత్వము సర్వత్రా ఉంటున్నది దైవము కానిది ఎక్కడా లేదు. కాబట్టి మీరందరూ దైవస్వరూపులే. మీ అందరి యందు విద్యుచ్ఛక్తి, అయస్కాంతశక్తి, అణుశక్తి, ఉష్ణశక్తి సర్వశక్తులూ ఉంటున్నాయి. ఈ కాంతిశక్తి అనేటటు

( తరువాయి 34 వ పేజీలో )

# శ్రీ సత్యసాయిబాబావారితో నా అనుభవాలు

- డా॥ భాటియా

[ జపాను దేశపు సత్యసాయి సంస్థలవారి "కాన్ సాయి లైటు Vol 32 మార్చి 1994" సంచికలో ప్రచురింపబడిన వ్యాసమునకు అనువాదము- ఎస్. బి. ఎస్. రామారావు. ]

( గత సంచిక తరువాయి )

"నేను 1981 వ సం॥లో ఒకసారి స్వామి దర్శనమునకై వేచివుండగా, స్వామి నా ముందుగా వెళ్ళడం జరిగింది. నేను మనస్సులోనే మౌనంగా, స్వామీ ! నాకు మీ వైద్యశాలలో ఉద్యోగం ఇప్పించండి అని ప్రార్థించాను కాని స్వామి ఏమీ ఎరగనట్లుగ వెళ్ళిపోయారు అపుడు నాకు మనస్సులో 'ఈయన నిజంగా భగవంతుడేనా ? భగవంతుడు సర్వజ్ఞుడుకదా! ఈయన ఏమీ తెలియనట్లు ప్రవర్తిస్తున్నారేమిటి? మరి ఈయనను భగవంతుడని ఎలా నమ్మడం అనుకున్నాను అంతేకాదు, మనసులో, స్వామీ నీవే దైవం అయితే నా ప్రార్థనము ఆలకించలేవా ? అనుకున్నాను. అంతే స్వామి తటాలున వెనుకకు వచ్చి ; నా కళ్ళలోకి సూటిగా చూసి ఇలా అన్నారు : "వాళ్ళందరూ నావారు కాదా? వారికి ఆరోగ్యం ఇవ్వడంకూడా నేను చూసుకోవలసిన విషయం కాదా ? మనం ఎక్కడ పనిచేస్తున్నా, భగవంతుడి సేవయే చేస్తున్నాం అనుకోవాలి" స్వామి అలా అనగానే నా అజ్ఞానాంధకారం తొలగింది

మరొకసారి నేను పుట్టపర్తిలో స్వామి దర్శనానికై ఎదురుచూస్తూ మనస్సులో, పంజాబులోగల నా స్నేహితుడు, నాచే వైద్యం పొందుతున్న ఒక వ్యక్తిని గురించి ఆలోచిస్తున్నాను పాపం ఆ వ్యక్తి మధుమేహపు రోగం వలన (Gangrere) కాళ్ళు కుళ్ళిపోతున్నాయి అలాకుళ్ళిపోయిన కాలు కోసి తొలగించటం ( Amputation ) తప్ప, ఆ వ్యాధికి వేరే మందు లేదు. నేనీ విషయం ఆలోచిస్తుండగా స్వామి దర్శనానికై బయటకు వచ్చి, నా ముందు నిలబడి 'ధర్మ సింగ్' ని గురించి ఆలోచిస్తున్నావా ? అన్నారు అలా అంటూనే స్వామి తమ దివ్య హస్తాలతో గుప్పెడు విభూతి సృష్టించి ఇచ్చి, ఇది తీసికొని వెళ్ళి "ధర్మసింగ్" కి ఇయ్యి అన్నారు నేనాసమయంలో ధర్మసింగ్ గురించే ఆలోచించాను నేనా విభూతి తీసికొని తిరిగి వెంటనే పంజాబు చేరేసరికి, ధర్మసింగ్ నేలమీదకు దింపబడి, దుప్పటి కాళ్ళకు కప్పుకుని పరుండిఉన్నాడు. కాళ్ళు కుళ్ళిపోయిఉన్నాయి 'ధర్మసింగ్' ఎలా వున్నావు ? అని నేను పలుకరించగానే, అతడు డా॥ భాటియా - సాయిబాబా భగవంతుడు. వాహే గురు - సాయిబాబా! వాహే గురు !! అన్నాడు నన్ను చూడగానే ధర్మసింగ్ ఇలా అంటూ భోరున ఏడుస్తూ, డా॥ భాటియా, సాయిబాబా - వాహే గురు - వాహే గురు - నాకు సర్వం సాయిబాబాయే అంటూ గట్టిగా భోరున ఏడ్చేసాడు.

నేను స్వామి సృష్టించి ఇచ్చిన విభూతి ప్రసాదం ఇచ్చాను అంతే ఆశ్చర్యం ఆ విభూతి వైద్యంతో అతని కుళ్ళిపోయిన కాళ్ళ భాగాలు తిరిగి బాగుపడి, మామూలుగా కోలుకొన్నాడు అంతలోకే స్వామి పంపినట్లుగా ఇద్దరు జర్మనీ దేశపు వైద్యులు - రీసెర్చిచేస్తూ వచ్చి ఇటివ కుళ్ళిపోతున్న కాళ్ళకి - షుగరు వ్యాధికి - నారింజపండు ఎండు తొక్కలు పొడుం చేసి వారం రోజులపాటు, ఉదయం ఒక చెంచాడు పొడుం, సాయంత్రం ఒక చెంచాడు తినిపిస్తే చాలు - పూర్తిగా షుగరువ్యాధి పోతుందని చెపుతూ - ఆ వైద్యం ఇతినిచే ఆచరింపచేశారు. మరి వారం రోజులకు అతని

మామూలుగా కాళ్ళు బాగుపడి, లేచి తిరిగాడు. ఇటువంటి రోగానికి కాలులో కుళ్ళిన భాగం కోసివేసి తీసివెయ్యడం అవసరాన్ని బట్టి కాలు 'కట్' చేసెయ్యడం తప్ప వేరే వైద్యమే చూడని నేను 'వైద్యుడిగా' సిగ్గుపడటమేకాక భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి 'ప్రజాసేవ' స్వామి ఇచ్చిన విభూతి మహాత్మ్యమునకు ఆశ్చర్యపడ్డాను. ఏమి అద్భుతం ఇది ? ఎట్టి వైద్యమిది అంతా భగవశ్శక్తి.

పుట్టపర్తినుండి బెంగుళూరు వెళ్ళే దారిలో 'ముదనాళి' దగ్గర స్వామి స్కూలు ఉన్నది. 1993 వ సం॥ ఫిబ్రవరి నెలలో పాఠశాల సంవత్సరాంతపు ఉత్సవము జరుపుకున్నారు ఆ పండుగలో పాల్గొనుటకు స్వామి వస్తానని పిల్లలతో చెప్పారు. ఆ రోజు పిల్లలు స్వామికై చాలా ఎదురుచూసారు, కానీ స్వామి వస్తోన్న జాడలేవీ కనబడలేదు. సాంస్కృతిక కార్యక్రమాలు, పిల్లల నృత్యాలు వగైరా జరిగాయి. కార్యక్రమం జరిగిపోయింది పిల్లల నృత్య ప్రదర్శనలపుడు అనేక ఫొటోలు తీసారు. ఒక ఫొటో స్టేజీపై పిల్లలు నృత్యం చేస్తుండగా వారి మధ్య స్వామి నిలబడినట్లు ఫొటోలో వచ్చారు. ఆ ఫొటోలో స్వామి ఐదుచోట్ల నిలబడినట్లుగా, ఐదుచోట్ల వేరువేరు రంగులలో నున్న ఐదు అంగర్కాలు ధరించిన ఫోజులలో స్వామి చిత్రీకరింపబడ్డారు. ఆ కార్యక్రమానికి నేను కూడా (డా॥ భాటియా) హాజరవడం జరిగింది. ఆ ఫొటోలు నేను తీసికొని వెళ్ళి స్వామికి చూపిస్తే, స్వామినవ్వుతూ 'ఫొటోగ్రఫిక్ ట్రిక్కు' అన్నారు. అంత నేను, కాదు స్వామీ ! 'ఇది సాయిబాబావారి దివ్యలీల దయతో ఈ ఫొటోలపై సంతకం చెయ్యండి' అన్నాను. స్వామి చిరునవ్వుతో "ప్రేమతో – బాబా" అని సంతకం చేసారు.

మరొక స్వామి లీల: పుట్టపర్తికి సుమారు 600 కి.మీ. దూరంలో 'వేటపాలెం' అనే గ్రామం ఉన్నది. చీరాల దగ్గర సముద్ర తీరానికి కొంచెం దూరంలో ఈ గ్రామం-ప్రకాశం జిల్లా, ఆంధ్రప్రదేశ్‌లో వుంది. అక్కడ ఒక బట్టలు నేసికొనే పేదవాని చిన్న గృహంలో ఒకే ఒక గది. ఆ గదిలో స్వామికి చోటుఇచ్చి, యజమాని 'సాంబశివరావు' ప్రక్కనే పాక వేసికొని వుండసాగాడు. ఆ గదిలో వున్న సత్యసాయిబాబావారి ఫొటోల నుంచి ప్రతి పండుగకీ, ఆ పండుగలో ఆరాధింపబడే దేవతా రూపం చాలా చక్కగా, తీర్చిదిద్దినట్లుగా విభూతితో ఏర్పడుతుంది. వినాయక చవితికి గణేశరూపం, శివరాత్రికి శివలింగరూపం, దసరాకు దుర్గాదేవిరూపం, అలాగ రకరకాల విభూతి రూపాలు ఏర్పడుతున్నాయి. కొన్నాళ్ళ తరువాత ఆ విభూతి రాలిపోయి ఫొటోనుంచి ఒక దివ్య తేజస్సు వ్యక్తమై తిరిగి క్రొత్త దేవతా రూపం ఏర్పడుతుంది. అంతేకాదు, శివలింగాలు గాలి నుండి, గదిలో పైనుండి పడటం కుంకుమ, అమృతం, పటికబెల్లం ఫొటోలపై ఏర్పడటం జరుగుతోంది ఒకనాడు ఇంటి యజమాని సాంబశివరావు నోటినుండే శివలింగం ఏర్పడి బయటకువచ్చింది చిన్నపిల్లలకు అన్నప్రాశన చేయుటకై తీసికొనివచ్చి స్వామి ఫొటోకి ఎదురుగా గదిలో ఎదురు గోడ దగ్గర పరుండపెట్టి, పిల్లలకు అన్నప్రాశ నిమిత్తమై పరమాన్నం వండిన గిన్నె రెండవగోడ దగ్గరఉన్న స్వామి ఫొటో వద్ద ఉంచి, గది తలుపులు వేసేసి జనం అందరూ బయట కూర్చుని భజనచేసి కొంత సేపయ్యాక తలుపు తెరిస్తే, గిన్నెలోని పరమాన్నంలోంచి కొంతభాగం తీసినట్లుగా, చేతివ్రేళ్ళ ఆనవాళ్ళు, స్వామి ఫొటోనుంచి చంటిపిల్ల వరకూ నేలపై విభూతితో స్వామి పాద ముద్రలు, చంటిపాప మూతికి పరమాన్నం తిన్న మెతుకుల ఆనవాళ్ళు చూసేవారిని ఆశ్చర్యపరుస్తున్నాయి. అంతేకాదు స్వామిని దర్శించడానికి దూరతీరాలనుంచి అచటకు వచ్చిన భక్తులు చిన్న సైజువి రెండు కాళీ స్టీలు డబ్బాలు కొనుక్కొని ఒక దానిలో కుంకుం, మరొకదానిలో విభూతి చిటికెడు, చిటికెడు వేసి మూతపెట్టి స్వామి దగ్గరపెట్టి ఆ రాత్రి తలుపు మూసేసి, మర్నాడుదయం తలుపు తీసి చూస్తే ఆ రెండు డబ్బాలలోనూ కుంకుమ, విభూతి నిండుగా

నింపబడి అక్షయం అవుతున్నాయి. రాత్రి స్వామికి నైవేద్యం పెట్టిన యాపిల్‌పండు ఉదయం అయ్యేసరికి మధ్యలో తలవెంట్రుక పోసంతటి సన్నంగా, చాకుతో రెండు చెక్కలుగా అడ్డకోత కోసి తిరిగి అతికించి పెట్టి నట్టుగా ఉంటోంది. చేతితో విడదీస్తే రెండు చెక్కలు గుండ్రంగా మధ్యకు కోసినట్లు విడదీయబడి, ఆ పండు చెక్కల లోపల 'ఓం' అని బీజాక్షరముగాని, ఏదైనా మంత్రంగాని వ్రాయబడి కనబడుతోంది. పండుగలలో హిందూ దేవతామూర్తుల ఆకారములు ఈ ఫొటోలపై విభూతితో ఏర్పడడమే కాకుండా, ముస్లింల పండుగ లలో నక్షత్రం, చంద్రవంక, క్రిస్టియన్ల పండుగలలో ఏసుక్రీస్తు, శిలువ వగైరా విభూతి చిత్రాలు చాలా చక్కగా ఏర్పడుతున్నాయి.

ఇట్టి లీలలు భారతదేశానికి మాత్రమే పరిమితం అవలేదు. దేశవిదేశాలలో కూడా స్వామి లీలలు ఇంతకంటె విచిత్రంగా జరుగుతున్నాయి అమెరికాలో కెనేట్‌కట్‌లో ఒక సాయి భక్తుని ఇంట్లో గత పది సంవత్సరాలుగ పూజా గదిలో, పడక గదిలో, డ్రాయింగు రూములో అలమార్లలో, షెల్ఫులలో, అన్నం తినే గదిలో ఎక్కడ చూసినా విభూతి వర్షం– సాయి విభూతి పరిమళం– విభూతి మయం. ఇదంతా స్వామిని ఏమిటని అడిగితే, స్వామి నాకేమి తెలుసు అంటారు ! కానీ చిరునవ్వుతో చూస్తారు. సర్వం సాయి మయం జగత్ ! స్వామి సర్వవ్యాపకత్వానికి ఇంతకంటె వేరే నిదర్శనం ఏమి కావాలి.

అమెరికాలో నేను అమెరికన్ అసోసియేషన్ ఆఫ్ బ్లడ్ బ్యాంకుకు వెళ్ళినపుడు, బ్లడ్ బ్యాంకులో పనిచేసే చాలామంది ఉద్యోగస్తులు స్వామిని గురించి అనేక విషయాలు అడిగి, స్వామిని తలచుకొని వెక్కి-వెక్కి ఏడ్చారు. అపుడు నేను స్వామి ఫొటో ఒకటి తీసి వారికి చూపించగా, 'స్వామి చక్రవర్తి' అని వారన్నారు. అవును స్వామి షట్చక్రవర్తి. స్వామి చక్రవర్తులకు చక్రవర్తి. మనందరినీ ఉద్ధరించుట కవతరించిన దైవం. ప్రేమమూర్తి అంటూ డా॥ భాటియా జపానులో తమ ఉపన్యాసాన్ని ముగించారు. ◯

# సాకుమయ్యా నన్ను సాయిరామ

శ్రీలు వెలయుచున్న శ్రీసాయి ! రామయ్యా !
ఎటుల జెప్ప నీకు । ఎఱుగలేను
కలత అలముకొనెను । కష్టాలు నిండాయె
సాకుమయ్యా నన్ను । సాయిరామ !

ఇహము పరము అనెడు ఇరుకులో పడ్డాను
అసలు నిజము యేదో । అందజేయు
భ్రాంతి యనెడు వలలో । బాగుగ చిక్కాను
సాకుమయ్యా నన్ను । సాయిరామ !

మనిషిలోని మంచి । మనసులో ప్రశాంతి
తగ్గిపోవుచుండె దినదినంబు
మంచి వెలుగు బాట । మరి నాకు జూపించి
సాకుమయ్యా నన్ను । సాయిరామ !

కష్టనష్టమందు । కలతలు మది నిండె
వేచియుంటి మంచి । వెలుగు కొఱకు
మంచి వెలుగునిచ్చు । మంచిరోజెప్పుడో ?
సాకుమయ్యా నన్ను । సాయిరామ !

- ఆర్థి రఘునాథశర్మ

# గురు శిష్య బాంధవ్యము

-సోమంచి రామం

ఉపదేశించువాడు గురువు. ఉపదేశమొందువాడు శిష్యుడు. బోధకుడు గురువు. బోధితుడు శిష్యుడు. ప్రసాదించువాడు గురువు స్వీకరించువాడు శిష్యుడు. జ్ఞానదాత గురువు. తద్గ్రహీత శిష్యుడు ఈ గురు, శిష్య బాంధవ్యము అతి పవిత్రము గురువు ప్రసాదించేది ప్రతిఫలాపేక్షలేని బోధనము అందుకు ప్రతిగ, శిష్యుడందించేది త్యాగపూరిత సేవనము ఇట్లు ఒండొరులు, ఒకరికొకరుగ మనుగడ సాగించడమే వారి సంబంధ బాంధవ్యము.

జాతి సంస్కృతీ వారసత్వము, నైతిక ప్రవర్తనావళి, ఆధ్యాత్మిక సంపదలను తరతరాల శిష్యుల కందించేది ఈ గురువులే ! కాలము గడచిన కొద్దీ ఒకనాటి శిష్యులే, గురువులుగ రూపొందుతారు. శిష్యుని శీలసంపదను విశుద్ధముగ తీర్చిదిద్దుటకు, గురువుకు ఉన్నత ప్రమాణార్హతలవసరము. అంతకుమించిన ఉత్కృష్టమైన గుణగణాలుండడము ముఖ్యమే !

శిష్యుని కుపదేశించు శాస్త్రమునందు సంపూర్ణాధికారము సాధించాలి. ఉపదేశమునందు విరుద్ధతకు తావీయరాదు. దైవభక్తి, పాపభీతి కలిగి ఉండాలి ! తన విశుద్ధ ప్రవర్తనలో శిష్యుని గుణదోషములను పరిహరించాలి. శిష్యులందరిపట్ల సమధర్మము, న్యాయము, మంచితనము ప్రదర్శించాలి. అణకువ కల్గియుండాలి. దయార్ద్రహృదయుడై ఉండాలి. ఈర్ష్యాసూయలకు లోనుగాక, విశాలదృష్టితో స్నేహపాత్రుడిగా మెలగాలి. శిష్యునికి ధర్మమార్గాన్ని చూపాలి. వాని నడవడిలోని దుర్గుణాలను, వ్యసనాలను నశింపచేయాలి. ఆటంకాలను, అవరోధాలను అధిగమించేలా శిక్షణ నీయాలి. తద్వారా మోక్షప్రాప్తికి సాధన చేయించాలి. తన ఆదేశాలను తు.చ. తప్పకుండ ఆచరించే శిష్యులే గురువుకు ప్రీతిపాత్రులు.

ఇక శిష్యుల ప్రధాన కర్తవ్యము తమ అజ్ఞానాన్ని తొలగించుకొని, జ్ఞానాన్ని పొందడమే. అందుకుగాను శిష్యులకు, గురువుపై సంపూర్ణ లక్ష్యము, సంకోచ రహిత విశ్వాసము ఉండాలి. భక్తివిశ్వాసములతో గురువును సేవించాలి. తాము సాధించిన జ్ఞానాన్ని యితరులకు ఉపదేశించేలా శిష్యులు శిక్షణ పొందాలి.

మనసు పరిపరి విధముల పరిభ్రమించకుండ గురు, శిష్యుల ప్రవర్తనపరమాత్మయందే కేంద్రీకరించబడాలి

రామాయణంలో నారద మునీంద్రుడు గురువు, వాల్మీకి శిష్యుడు వారిరువురు పరస్పర సన్నిహితులై పరమాత్మ సేవకే అంకితులౌతారు. అందువలనే రామాయణ మహాకావ్యము, నీతి ధర్మశాస్త్ర పవిత్ర గ్రంధంగ పరిగణించబడుతోంది. కొన్ని వేల సంవత్సరాలు గడచిపోయినా ఈనాటికీ, మహిమాన్వితమై, దివ్యమైన కావ్యముగ సాధికారం మనగల్గుతోంది.

వాల్మీకి విరచిత రామాయణం_ నారద ప్రేరితం. దైవప్రసాదిత జ్ఞానము నుపదేశించుటకుద్భవించిన గురువు నారద మునీంద్రులు ఆ జ్ఞానమును, వాల్మీకి మహర్షికి, విపులీకరించి, వివరించగల శక్తిమంతుడగు గురువు ఆతడు. ఆ జ్ఞానమును గ్రహించి, తద్వారా రామాయణ మహాకావ్యాన్ని రచించి, ధర్మపథాన్ని ప్రజల కెరుక పరచి, ఆధ్యాత్మికానందము నొందిన అసమాన ప్రతిభావంతుడైన శిష్యుడు వాల్మీకి.

అందుకే ఆ గురు శిష్యుల సంబంధ బాంధవ్యము, అసామాన్యము, అసాధారణము, అజరామరము. ○

# గీత - అమృతవర్షిణి

-సాయి గంగామహాదేవ్

శ్లో॥ జరామరణ మోక్షాయ మామాశ్రిత్యయతన్తి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలమ్ ॥

— దేహమునకు ఆరు వికారములుంటున్నవి. 1. ఉండుట 2. పుట్టుట 3. పెరుగుట 4. మార్పు చెందుట 5. క్షీణించుట 6. మరణించుట జరా, మరణములనగా - వృద్ధాప్య, మరణములు. అనగా చివరి రెండు వికారములు ఈ రెండింటి ద్వారా తక్కిన వికారములు కూడా సూచింపబడుచున్నవి ఇట్టి షడ్భావ వికారములతో కూడినటువంటిదీ దేహము జీవుడు మేల్కొంచినది మొదలు, నిద్రించువరకు ఈ వికార సహితమైన దేహమే నేననుకొంటున్నాడు. ఇట్టి తాదాత్మ్యత వలననే మృత్యుభీతి కలుగుతున్నది. తాను కాని దానిని తానని భ్రమించుటవలన ఆ బాధ కలుగుతున్నది. బాధలు తొలగి శాశ్వతానంద ప్రాప్తి కలుగవలెనన్న, శాశ్వతానందమనే పదార్థమును ఆశ్రయించాలి వికారము దుఃఖదాయకము, నిర్వికారము ఆనంతము. కనుక వికారసహితమైన దేహ తాదాత్మ్యతను విడనాడి, నిర్వికారమైన బ్రహ్మపదార్థమును ఆశ్రయించితేనే శాశ్వతానందం ప్రాప్తి అంతేగాని దేహమునుండి శాశ్వతానందం లభించనేరదు

దేహ భ్రాంతి వలన అనేకానేక దుఃఖపరంపరలను పొందిన జీవుడు అనేక జన్మల తరువాత, మెల్లిమెల్లిగా విచారణోదయం కాగా, దేహంనుండి ఆనందం లభించదని నిర్వికార బ్రహ్మ పదార్థమే ఆనందమని గుర్తించి ఆనందమూర్తియైన భగవంతుని శరణు చెందగలడు విచారణతో సత్యాన్ని గుర్తించి దైవానికిశరణుచెందటం వలన విచారణతోపాటు దైవకృపవలన విజ్ఞానం లభిస్తుంది ఆ విజ్ఞానము వలన మొదట 'కర్మ' అంటే ఏమిటి ? తదుపరి 'అధ్యాత్మ' మంటే ఏమిటి ? ఆ తదుపరి 'బ్రహ్మ' తత్త్వము ఏమిటి ? అనేది విశదమౌతుంది. అంతవరకుకాదు. దేహ ధ్యాస ఉన్నంతవరకు దైవధ్యాస కుదరనంతవరకు యదార్థ విజ్ఞానం లభించదు అనగా అనుభవాత్మక విజ్ఞానం లభించదు.

ఐతే 'కర్మ' అంటే ఏమిటి ? భగవానుడే గీతలో 'భూతభావద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితమ్' అన్నారు. అనగా - భూతం = పంచ భూతములకు (తత్సంబంధమైన సమస్త వస్తు విషయాదులకు); భావః = ఉత్పత్తి; ఉద్భవః = వృద్ధి: కర = కలుగజేయునట్టి; విసర్గః = గొప్ప స్వభావమే: కర్మ సంజ్ఞితమ్; కర్మ అనబడుచున్నది అనగా మన స్వత్వమే కర్మ.

ఇక 'అధ్యాత్మము' ఏమిటి ? 'స్వభావోఽధ్యాత్మముచ్యతే' స్వభావమే అధ్యాత్మము స్వభావమంటే ఏమిటి ? 'స్వ' అనగా ఆత్మ ; 'భావ' మనగా అట్టి ఆత్మయందు జనించిన భావము. అనగా జీవత్వము. జీవత్వమే అధ్యాత్మము. అధి + ఆత్మ = అధ్యాత్మ 'ఆత్మ' తన స్వరూపము: 'అధి' అనగా ఆక్రమించుట, కప్పుట. తన స్వరూపమును ఆక్రమించినది, లేదా కప్పినదే అధ్యాత్మము అనగా జీవత్వము.

ఇక "బ్రహ్మ" మంటే ఏమిటి ? 'అక్షరం బ్రహ్మ పరమం' శ్రేష్ఠమైన అక్షరమే బ్రహ్మము. అక్షర మనగా నశించనిది అని ఒక అర్థము. కానీ 'క్షర' అనగా నాశనశీలమైన జీవత్వము, 'అ' నిర్వికార బ్రహ్మతత్త్వము. జీవత్వము + దైవత్వముచేరినది అక్షరత్వము అనగా సర్వ వ్యాపకమైనది సర్వము తానైనది బ్రహ్మమని అర్థము

భగవానునికి శరణాగతి చెందినవాడు మొదట 1. 'మనస్సు' అనగా ఆలోచనలను; 2 'జీవత్వము' అనగా అజ్ఞానమును 3. 'బ్రహ్మ అనగా ఆత్మను ఎరుగుచున్నదని భగవానుని బోధ. 

# కరుణామయుడు నెహ్రూ

-జానమద్ది హనుమచ్ఛాస్త్రి

బల్‌బీర్‌సింగ్ ఢిల్లీలో ఒక బాడుగ ట్యాక్సీ నడుపుతూ ఉండిన బీద డ్రైవర్. ఆ ట్యాక్సీ పాతదే కాని బల్‌బీర్‌సింగ్, దానిని శుభ్రంగా ఉంచేవాడు ప్రయాణికులతో ఎంతో సౌజన్యంగా వ్యవహరించేవాడు. అతని మంచితనాన్ని మెచ్చుకొని, ట్యాక్సీ కావలసినపుడు ప్రజలు అతని కోసం కబురుచేసేవారు.

బల్‌బీర్‌సింగ్ చాలాకాలంగా ఒక నియమాన్ని పాటిస్తూండేవాడు. ప్రతిదినమూ ఉదయాన్నే తన ట్యాక్సీతో తీన్‌మూర్తి భవనం రహదారికి ఒకవైపున నిలిపి అక్కడ నిల్చుండేవాడు. ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ పార్లమెంటు భవనానికి వెళ్ళటానికి, తమ భవనంనుండి వచ్చిన వెంటనే, బల్‌బీర్‌సింగ్ అత్యంత భక్తిశ్రద్ధలతో నమస్కరించేవాడు. వెంటనే ట్యాక్సీ ఎక్కి గిరాకీలకోసం గిరకలు వేసేవాడు.

దురదృష్టం కొద్ది, ఒకరోజు ఆ ట్యాక్సీని ఒక ట్రక్కు ఢీకొనింది. ట్యాక్సీ నుజ్జునుజ్జు అయింది. బల్‌బీర్‌సింగ్ చాల డబ్బు ఖర్చుచేసుకుని ట్యాక్సీ మరమ్మతు చేయించాడు. కాని ట్యాక్సీ మొదటి అందం పోయింది ఆకర్షణ అదృశ్యమైంది. సింగ్ ట్యాక్సీకి గిరాకిపోయింది. బల్‌బీర్‌సింగ్ జీవితం దుర్భరమైంది. కాని సింగ్ తన ఆనవాయితీ ప్రకారం తీన్‌మూర్తి భవనం ముందు రహదారి పక్కన ఉంచుకుని, నెహ్రూజీకి నమస్కరించి వెళ్ళే సంప్రదాయాన్ని వదలలేదు.

ఒకరోజు నెహ్రూ బల్‌బీర్‌సింగ్ వద్దకు వచ్చి భుజంపై చేయివేసారు. "రోజూ, నాకోసం వేచివుంటున్నావు, ఎందుకోసం ? అని ప్రశ్నించారు.

'తమను చూస్తే నాకెంతో సంతోషంగా ఉంటుంది. అదొక్కటే నా రాకకు కారణం' నెహ్రూ నవ్వుతూ 'నన్ను చూచినంతమాత్రాన నీ పొట్ట నిండుతుందా ? ఈ ట్యాక్సీవల్ల నీకెంత ఆదాయం వుంటుంది? ' అని అడిగారు.

'నా కుటుంబ పోషణకు కావలసినంత సంపాదన ఉండేది కాని ఇటీవల ట్యాక్సీ ప్రమాదానికి గురైనప్పటినుండి నా ఆదాయం బాగా దెబ్బతింది. అప్పుల బాధలెక్కువైనాయి' అంటూ బల్‌బీర్‌సింగ్ తన దీన గాథను వినిపించాడు

నెహ్రూ అతని ట్యాక్సీని చూచారు. 'నీ ట్యాక్సీ ఏమీ బాగాలేదు. అందువల్లనే నీకు గిరాకీలు తగ్గిపోయాయి. అందమైన ఒక ట్యాక్సీకొని బాగా సంపాదించు' అన్నారు!

బల్‌బీర్‌సింగ్ తలవంచుకున్నాడు "నా దగ్గర డబ్బు లెక్కడున్నాయిసార్? అప్పుకోసం బ్యాంక్ వాళ్ళ దగ్గరకు వెళ్తే జామీను ఎవరిస్తారు ! అని ప్రశ్నిస్తారు. నావంటి బీదవానికి ఎవరు జామీను ఇస్తారు? ఎవరు పైకం ఇస్తారు సార్?' అంటూ దీనంగా పలికాడు.

నెహ్రూ కాసేపు ఆలోచించారు 'నీవు అప్పుకోసం బ్యాంకులో దరఖాస్తు ఇవ్వు. జామీను ఎవరు ? అని అడిగితే ప్రధాని నెహ్రూ అని బ్యాంక్ మేనేజరుగారికి చెప్పు రేపు మధ్యాహ్నం నేను బ్యాంక్ వద్దకు వచ్చి నీ పని పూర్తిచేయిస్తాను' అంటూ ధైర్యం చెప్పారు నెహ్రూ.

అలా అన్న నెహ్రూ పార్లమెంటు భవనానికి వెళ్లారు. బల్‌బీర్‌సింగ్ నిరుత్తరుడయ్యాడు ఆనందంతో మెమరచాడు

మరుసటిరోజు బల్‌బీర్‌సింగ్ బ్యాంకకు వెళ్ళి అప్పు కోసం దరఖాస్తు అందించాడు దరఖాస్తు పత్రంలో జామీను ఇచ్చే వ్యక్తి పేరు ముందు 'ప్రధాని నెహ్రూ' అని రాయటాన్ని గమనించి, బ్యాంక్ మేనేజర్ ఉగ్రుడైనాడు 'నీకేం పిచ్చా ? పెద్దలపేరుతో మమ్మ మోసం చేయదలచావా ? ' అంటూ కేకలు వేసి, సింగ్‌ను బైటికి పంపాడు

మరుసటిరోజు మధ్యాహ్నం పండ్రెండు గంటల సమయం బల్‌బీర్‌సింగ్ బ్యాంక్ ముందు పక్కన నిల్చుని ఉన్నాడు. బ్యాంక్ ముందు ఒక కారు ఆగింది ఆ కారులో నుంచి నెహ్రూ, అనుకున్నట్లే దిగారు బల్‌బీర్‌సింగ్‌ను వెతుక్కుంటూ అతని వద్దకు వచ్చారు

'అప్పుకోసం దరఖాస్తు ఇచ్చావా ? ' అని అడిగారు నెహ్రూ

'ఇచ్చాను సార్, కాని వారికి నామీద నమ్మకంలేదు' అన్నాడు

నెహ్రూ బ్యాంక్‌లోనికి వెళ్ళారు. అందరికీ ఆశ్చర్యం. సిబ్బంది దిగ్భ్రాంతితో నిల్చున్నారు. మేనేజర్ గబగబావచ్చి ప్రధానికి స్వాగతం పలుకుతూ 'సార్ తామే రావాలా ? కబురుచేసి వుంటే, నేనే తమ వద్దకు వచ్చి తాము చెప్పిన పని పూర్తిచేసి ఉండేవాణ్ణి కదా ? ' అంటూ వినయంగా పలికాడు

"నేను బల్‌బీర్‌సింగ్ అప్పుకు పూచీగా ఉంటాను. వెంటనే పత్రాల్లో నా సంతకం తీసుకోండి. నాకు వేరే పనులున్నాయి అన్నారు నెహ్రూ. మేనేజర్ వెంటనే పత్రాల్లో జవహర్‌లాల్‌గారి సంతకాలు తీసుకున్నాడు.

నెహ్రూ బల్‌బీర్‌సింగ్ వెన్నుతట్టి ' ఈ డబ్బుతో మంచి ట్యాక్సీ కొను. బాగా కష్టపడి సంపాదించు పిల్లలకు మంచి ఆహారం, దుస్తులు అందించు ' అంటూ చెప్పి వెళ్ళిపోయారు.



బల్‌బీర్‌సింగ్ కొత్తకారుతో ఇంటికి వచ్చాడు. 'పండిట్ జవహర్‌లాల్‌గారి దయవల్ల నాకు మహద్భాగ్యం కల్గింది.' అంటూ భార్యతో తన సంతోషాన్ని వెలిబుచ్చాడు.

మరుసటి నెల నుండి తను చెల్లించాల్సిన అప్పు వాయిదా మొత్తంలో సగం పైకాన్ని జవహర్‌లాల్‌గారే బ్యాంక్‌కు చెల్లించేవారని తెలుసుకుని ఆశ్చర్యచకితుడయ్యాడు.

ఆనవాయితీ ప్రకారం రోజూ ఉదయాన్నే జవహర్‌లాల్‌గారిని దర్శించేవాడు బల్‌బీర్‌సింగ్. జవహర్‌లాల్ కాలగర్భంలో కలసిపోయినపుడు కన్నీరు కారుస్తూ శ్మశానందాకా వెళ్లాడు. ఆ తర్వాత రోజూ జవహర్‌లాల్ సమాధివద్దకు వెళ్ళి ఒక ఎర్ర గులాబీని సమాధిపై ఉంచి మోకరిల్లేవాడు. తర్వాత తన జీవికకోసం వెళ్ళేవాడు.

)-○-(

# అపూర్వ అనువాదంతో అమరుడైన

# రాజకీయ "విదురుడు" లింగరాజు

—————— కంచి వాసుదేవరావు

రాష్ట్రమే కాదు. దేశమంతా గర్వించదగిన కాంగ్రెస్ నాయకులను తూర్పు గోదావరి జిల్లా ప్రసాదించింది. ఆంధ్ర భీష్మ న్యాపతి సుబ్బారావు, బులుసు సాంబమూర్తి, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, గుమ్మడిదల దుర్గాబాయమ్మ (దుర్గాబాయి దేశ్‌ముఖ్) మద్దూరి అన్నపూర్ణయ్య 'దేశబాంధవి' దువ్వూరి సుబ్బమ్మ, బారు రాజారావు, కళా వెంకటరావు, మొసలికంటి తిరుమలరావు, క్రొవ్విడి లింగరాజు, ఎ బి నాగేశ్వరరావు, ముళ్ళపూడి పళ్ళంరాజు– ఈ విధంగా చెప్పుకుపోతే జాబితా చాలా పెద్దది అయిపోతుంది. దేశభక్తి సేవాతత్పరత అంకితభావాలలో ఎవరూ ఎవరికి తీసిపోకపోయినా– ఎవరికి వుండే ప్రత్యేకత వారికి వుంది వీరందరిలో లింగరాజుగారిది వైవిధ్య వ్యక్తిత్వం.

ఆయన నిష్కళంక దేశభక్తుడు, గాంధేయవాది స్వాతంత్ర్య సమరయోధుడు రాజనీతిజ్ఞుడు, పత్రికా రచయిత, సంపాదకుడు, రచయిత లౌక్యం తెలిసినవాడు అందువలన అందరికీ గౌరవనీయుడూ స్నేహపాత్రుడయినాడు రాజమండ్రి రత్నత్రయంలో వీరు ఒకరు. మిగిలిన యిద్దరూ ఎన్. బి నాగేశ్వరరావు, వంగవీటి దీక్షితులూ ఈ ముగ్గురికీ స్ఫూర్తిదాత గౌతమీ ఆశ్రమ సంస్థాపకులు, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు.

## వీరబలి సంపాదకీయానికి జైలుశిక్ష

మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు. రామచంద్రుని వెంకటప్పల సహకారంతో– సీతానగరం ఆశ్రమం నుంచి నడపిన కాంగ్రెస్ పత్రిక బ్రిటిష్ ప్రభుత్వంపై నిప్పులు చెరగుతూ సంపాదకీయాలు రాసేది. మద్దూరి అన్నపూర్ణయ్యగారు చిచ్చరపిడుగు సంపాదకీయం రాసి జైలుకు వెళ్ళిన తర్వాత లింగరాజుగారు కూడా ఆ పత్రికను సంపాదకత్వం వహించి నిప్పులుచెరిగే సంపాదకీయాలు రాసేవారు. భగత్‌సింగ్‌ను బ్రిటిష్ ప్రభుత్వం ఉరి తీసినప్పుడు– లింగరాజుగారు రెండున్నర సంవత్సరాలు కఠిన కారాగారశిక్ష అనుభవించ వలసి వచ్చింది. ముసలి జననీ జనకులు దిక్కులేని స్థితిలో వుండి– తన అండదండలు అవసరం అయినప్పటికీ, ఆయన మనోధైర్యాన్ని కోల్పోక జైలు శిక్షను అనుభవించారు

ఈయన సంపాదకీయాలు, ప్రజ్ఞ ఆంధ్రకేసరి ప్రకాశంగారిని అమితంగా ఆకర్షించాయి 1935 లో స్వరాజ్య దినపత్రికను పునరుద్ధరించా న్న ప్రయత్నాలు ప్రారంభించి, తనకు సహాయకునిగా లింగరాజుగారిని తీసుకున్నారుట ఆ ప్రయత్నాలు ఫలించలేదు. 1951 ప్రాంతంలో మద్రాస్ నుంచి ప్రకాశంగారు తెలుగులో ప్రజా దినపత్రికను ప్రారంభించి, దానికి లింగరాజుగారిని సంపాదకులను చేశారు. ఆ పత్రిక స్వరాజ్య మాదిరిగానే, ఆర్థికంగా విజయవంతంకాలేదు. పత్రికకు ప్రజలనుంచి మంచి ఆదరణ లభించిందని, సర్క్యులేషన్ బాగా వుండేదని, కాని ఈ ఆనుకూల పరిస్థితులను సమర్థవంతంగా వినియోగించుకునే వ్యవస్థ లేకపోవడం వలన అది నిలిచిపోయిందని లింగరాజుగారు నాతో అనే

వారు. తగిన వ్యవస్థ, యంత్రాంగం లేకుండా పత్రిక సర్క్యులేషన్ పెరగడంకూడా వినాశకరమే అని అంటూవుండేవాడు.

1930 తర్వాత రాజమండ్రినుంచి గౌతమి అనే పత్రికను నడిపారు. ఈ పత్రికలో సరదాగా ఉద్యోగంలో చేరిన గంధం సీతారామాంజనేయులుగారు రాజమండ్రిలో స్థానిక దిన పత్రికను స్థాపించడానికి ఈ పత్రికే ప్రేరణ యిచ్చింది. సమాచారమ్ దాదాపు 40 సంవత్సరాలనుంచి నిరాటంకంగా నడుస్తోంది. 1974 ప్రాంతంలో వేదిక పత్రికను నడిపారు. ఐతే పత్రికా నిర్వహణలో తన రాజకీయ గురువు, ప్రకాశం గారి మాదిరిగానే విఫలమయ్యారు. ఆయనలో ఎన్ని గొప్ప లక్షణాలువున్నా వ్యాపారదక్షత లేదు.

## వారం వారం విదురుడు

లింగరాజుగారు చక్కటి పత్రికా రచయిత, విశిష్టమైన రాజకీయ విమర్శకుడు. కృష్ణా పత్రికలో "విదురుడు" అన్న కలం పేరుతో 1961-72 మధ్య వారం వారం అన్న శీర్షికలో వ్రాసిన రాజకీయ విమర్శలు పార్టీ వర్గ విభేదాలకు అతీతంగా అందరినీ ఆకట్టుకునేవి. కౌరవ సభలో విదురుడు ఒక్కొక్కసారి అప్రియంగా కన్పించే హిత వచనాలు చెప్పినట్లే- లింగరాజు కూడా, అప్పటికే గాంధేయ వాదానికి దూరమయి పదవీలాలసులైన కాంగ్రెస్ నాయకులకు అప్రియ హితవచనాలు చెప్పేవారు. నా అదృష్టంకొద్దీ అప్పుడు నేను కృష్ణా పత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేస్తూవుండేవాడిని. ఆయన హైదరాబాద్‌కు వచ్చినప్పుడల్లా కృష్ణా పత్రిక ఆఫీసుకు వచ్చేవారు. అప్పుడు ఎన్నో విషయాలు చెబుతూ ఉత్తేజపరిచేవారు. పత్రికా రచయితగా (రాజకీయ సమీక్షకునిగా) లింగరాజుగారి ప్రభావం నామీద వుంది. ఇంకా 'సంచారి' అన్న పేరుతో నిజం నిష్ఠూరమనిపించే రాజకీయ వ్యాఖ్యలు చేసేవారు.

## రచయిత, అనువాదకుడు

లింగరాజుగారిని రచయితగా విశేషమైన పేరు ప్రఖ్యాతులను తెచ్చి పెట్టినది. 'అమ్మ' నవల. కాననూరు జైల్లో వున్నప్పుడు ( 1932 ) ఆయన మాక్సిం గోర్కీ- ప్రఖ్యాత నవలను అనువదించారు. ఐతే అనువాదం కొంతసాగాక - అది ఆనాటి కృతకమైన అనువాద భాషలో వుందని - ఇందువలన తను ఆశించిన ప్రయోజనం నెరవేరదని గ్రహించి - సామాన్య పాఠకులను ఆకట్టుకుని-వారిని ఉత్తేజపరచగలిగిన సరళ వ్యవహారిక భాషలో తిరిగి అనువదించారు. ఆ నవల ఆనాటి తెలుగు పాఠకులను విశేషంగా ఆకర్షించింది. తెలుగువారిలో సోషలిస్టు భావాలను కలిగించి తొలి తెలుగు నవలలు- ఉన్నతవాది మాలపల్లి క్రొవ్విడివారి 'అమ్మ' అని అంటారు మౌలానాఆజాద్‌గా ఇండియా విన్స్ ఫ్రీడం- నెహ్రూ డిస్కవరీ ఆఫ్ ఇండియా. తిలక్ జీవిత చరిత్రలను అనువదించారు. వీరసావార్కర్ రచనలను అనువదించి కాంగ్రెస్‌లో ప్రచురిస్తూవుండేవారు. అంతేకాక ప్రేమ్‌చంద్ కథలను అనువదించారు. స్వయంగా తెలుగులో కొన్ని కథలు రాశారు. వారి కథలలో సామాజిక స్పృహ, ఆలోచనాత్మకత సమయోచిత హాస్యం త్రివేణీ సంగమంలా విలీనమయి వుంటాయి. ఆయనకు సమకాలీనసాహిత్యంపై నిర్దిష్టమైన అభిప్రాయాలు వున్నాయి. తన కాలపు సాహిత్య పోకడలను విమర్శిస్తూ ' ఎవరు చూచినా బీదతనం,తప్పితే వివాహ వ్యవస్థ అది కాకపోతే పచ్చి శృంగారం మీద వ్రాస్తున్నారని అన్నారు. మొక్కపాటి నరసింహశాస్త్రి గారి బారిష్టరు పార్వతీశంలో హాస్యం కృత్రిమమైనదని అంటారు. సామాన్యుడికోసం రాస్తున్నట్లు చెప్పుకుంటున్న శ్రీశ్రీ కవిత్వం నిజంగా సామాన్యునికి అర్థం అవుతోందా? అని ప్రశ్నించారు. ప్రకాశంగారి ఆత్మకథ రచనలో తోడ్పడ్డాయి.

## స్వాతంత్ర్య సమరయోధుడు

ఉప్పు సత్యాగ్రహం, వ్యక్తి సత్యాగ్రహం క్విట్

ఇండియా ఉద్యమాలలో పాల్గొని జైలుకు వెళ్ళారు. అవిభక్త మద్రాస్ రాష్ట్ర విధానసభకు రెండుసార్లు ఎన్నికఅయ్యారు. ప్రకాశంగారికి పార్లమెంటరీ కార్యదర్శి అయ్యారు. మున్సిపల్ ఛైర్మన్ అయ్యారు. ఆంధ్ర స్వాతంత్ర్య సమరయోధుల సంఘ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించడమేకాక, స్వాతంత్ర్య సమరయోధులు అనేకమందికి అండదండలుగా వుండే వారు.

లింగరాజుగారు మంచి వక్త, చమత్కార ప్రియుడు, బహిరంగసభలలో మాట్లాడుతున్నా, మిత్రులతో మాట్లాడుతున్నా ఆయన ఆకట్టుకునేవారు.

రాజమండ్రి మున్సిపాలిటీకి రెండుసార్లు ఛైర్మన్‌గా వున్నారు రాజమండ్రికి సంబంధించిన ప్రతి ఉద్యమం లోనూ ఆయనకు సంబంధం వుంది. రాజమండ్రిలోని అనేక సంస్థలకు వ్యవస్థలకు వెన్నెముకగా పనిచేసారు.

లింగరాజుగారికి చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి కవితానీరాజనం సమర్పిస్తూ –

"పువ్వును బోలు మానసము, ప్రోజ్వలితంబగు దేశభక్తియున్
దవ్వుల గానవచ్చు సముదంచితమైన వివేక దీప్తియున్
నవ్వడిలేని సంఘ పరిచర్య,మహాత్ము ల యర్ధజాడలో
గ్రొవ్విడి లింగరాజు మన కులగురువుం కద వృద్ధమూర్తియై"

అని అన్నారు

# దేవుడా నన్ను క్షమించు

—ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

పిల్లలందరు కలసి వేటకు వెళ్లారు. అడవిలో వారికి ఒక లేడి కనిపించింది. ఆ జంతువు పారిపోకుండా అంతా నిశ్శబ్దంగా వున్నారు. వారిలోని ఒక బాలుడు తుపాకితో గురిచూసి ఆ లేడిని కొట్టాడు గుండు దెబ్బ తిన్న లేడి వెంటనే పడిపోయింది.

భలే ! భలే ! బాగా గురిచూసి కొట్టావు. అని ఆ బాలుడిని నేస్తాలందరు మెచ్చుకుంటున్నారు. అప్పుడు....

ఆ బాలుడు తన మిత్రులతో, "ఆగండి ! అయ్యో ! పాపం ఆ లేడి ఎలా గిలగిలా కొట్టుకొంటోందో .... ఎలాగ మూలుగుతోందో .... ఎంతపని చేశాను. మనకి దెబ్బ తగిలితే ఎంతగా ఏడుస్తాం ! అయ్యో .... దీనిని ఎందుకు కొట్టాను. దాని కళ్ళలో నుంచి నీళ్ళు ఎలాగ కారుతున్నాయో ! ' అని తను కూడా బాధపడ సాగాడు.

ఆ మిత్రులు .... 'అయ్యో నువ్వు ఏడుస్తున్నావా?' అని అతనిని అడిగారు. అందుకు ఆ బాలుడు 'అవును.... అనవసరంగా ఎవరిని హింసించకూడదు. అయ్యో .... లేడి చనిపోయినట్లుంది భగవంతుడా .... ఇలాంటి పాపాలు ఇంకెప్పుడూ చెయ్యను నన్ను క్షమించు. దేవుడా నన్ను క్షమించు' అని వారితో అని ఎంతగానో బాధపడ్డాడు ఈ దృశ్యం అతని మనస్సులో చెరగని ముద్ర వేసుకుంది. తరువాత ఈ బాలుడు ఎన్నో మంచి పనులు చేసి కీర్తిగడించాడు

లేడిని కొటిన బాలుడు ఎవరో కాదు. మన భారత దేశ ప్రథమప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ

# నవశకానికి నాంది

కె. ఆర్. కె. మోహన్

కొన్ని కోట్ల సంవత్సరాల క్రితం భూమి నిక్షిప్త పరచిన బొగ్గు, పెట్రోలియం వంటి సహజ వనరులు విపరీతంగా వినియోగం అవుతుండడంవల్ల త్వరత్వరగా తరిగిపోతున్నాయి. ఫలితంగా ఏర్పడగల శక్తి సంక్షోభాన్ని ఎదుర్కొనేందుకు ప్రత్యామ్నాయ ఇంధనాలను, శక్తి - ఉత్పత్తికి నూతన పద్ధతులను కనుగొనడం ఒక్కటే పరిష్కార మార్గం. ఈ విషయంలో జపాన్‌లో జరుగుతున్న పరిశోధనలు ఆసక్తికరంగానూ ఆశాజనకంగానూ ఉన్నాయి.

జపాన్ దేశం అనేక ద్వీపాల సముదాయం అందువల్ల సముద్ర జలాలు అపారంగా అందుబాటులో ఉన్నాయి. ఈ జలాల్ని సద్వినియోగపరచి విద్యుత్తును ఎందుకు ఉత్పత్తి చేయరాదు అన్న ఆలోచన ఆ దేశ శాస్త్రవేత్తలకు వచ్చింది. ఇందుకు ఒక పైలట్ ప్రాజెక్టుకి రూపకల్పన చేశారు. ఈ ప్లాంట్‌ని సముద్రతీరానికి ఆరు వందల మీటర్ల దూరంలో 150 మీటర్ల ఎత్తున నిర్మిస్తారు. దీనినుంచి 130 మీటర్ల పొడవుండే కాలువ ఒకటుంటుంది. దీనికి పైన ఒకటి క్రింద ఒకటి - రెండు రిజర్వాయర్‌లు ఉంటాయి సముద్ర నీటిని ప్రతి సెకనుకు ఇరవయ్యారు టన్నుల చొప్పున పంప్ చేసి పైనున్న రిజర్వాయిల్‌లోకి పంపుతారు అక్కడినుంచి అది క్రిందనున్న రిజర్వాయర్‌లోకి పడుతుంది క్రిందనున్న పవర్‌స్టేషన్లోని టర్బయిన్లు విద్యుత్తును ఉత్పత్తిచేస్తాయి ఈ పద్ధతివల్ల ముప్పదివేల కిలోవాట్ల విద్యుత్తు ఉత్పత్తి కాగలదట. ప్లాంట్ నిర్మాణం పూర్తి అయ్యాక ఐదు సంవత్సరాలపాటు వివిధ పరీక్షలు నిర్వహిస్తారు అయితే ఈ పద్ధతి విజయవంతం కావడానికి ఎన్నో సమస్యలు పరిష్కారం కావలసి ఉంది. వీటిలో ప్రధానమైనది ఉప్పునీటికున్న లక్షణం లోహాల్ని తినివేయడం. అలాగే పంపు చేస్తున్న నీటితోపాటు సముద్ర సూక్ష్మజీవాలు రిజర్వాయర్‌లోకి ప్రవేశించి ఇబ్బందులను కల్పించగలవు ఆ పైన పైకి పంపు అయిన ఉప్పునీరు గాలికి చెదిరి సమీపంలోని పంట పొలాల్ని పాడుచేయవచ్చు అలాగే ఉప్పునీరు నేల మీద చిమ్మి మంచి నేలలు కూడా ఊసరక్షేత్రాలుగా మారవచ్చు. అందువల్ల ఈ ప్లాంట్‌లను పంటపొలాలకు దూరంగా నిర్మించడం అవసరం మిగిలిన సమస్యలు కూడా రిజర్వాయర్‌ల్లో రబ్బరు షీట్‌లు పరచడం, కాలువని రెయిన్‌ఫోర్స్‌డ్ ప్లాస్టిక్‌తో లైనింగ్ చేయడం వంటి ప్రక్రియలవల్ల పరిష్కరించవచ్చు. జపాన్ శాస్త్రజ్ఞుల పరిశోధనలు ఫలిస్తే ప్రపంచవ్యాప్తంగా శక్తి సంక్షోభం ముగిసి నవశకానికి నాంది పలకవచ్చని ఆశించవచ్చు.

## విదురనీతి

"న రాజ్యం ప్రాప్తమిత్యేవ
వర్తితవ్యమ సాంప్రతమ్
శ్రియం హ్యవినయో హన్తి
జరారూపమివోత్తమమ్"

రాజ్యము లభించినంతనే అనుచితముగా ప్రవర్తించరాదు ఎంత మంచి రూపునైననూ ముసలితనము హరించునట్లు, ఎట్టి సంపదనైనను అవినయము నశింపజేయును

# అమెరికాలోని భారతీయ నికేతనం

-డా॥ రాపర్ల జనార్దనరావు

వివేకానందుడు చికాగోలో వెలిగించిన భారతీయ జ్యోతి ఈనాటికీ చెదరకుండా వెలుగుతోంది అచట భారతీయులు తమ సాంప్రదాయాలను సంస్కృతిని మరచిపోకుండగ తమ బిడ్డలు కూడ తెలిసికునేటట్లు వివిధ కార్యక్రమాల ద్వారా వీలైన వసతులను వినియోగించి ఏర్పాట్లు చేసికొనటం ఇచ్చట గల భారతీయు లందరూ గర్వించదగిన విషయం

ఒక విషయానికివస్తే, స్వదేశానికి దూరంగా ఉన్నారేమో గాని ఒకప్పుడు ఇచట భారతీయుల కన్న అచట గల భారతీయులకే తమ సంస్కృతిపట్ల ఆదరణ, మక్కువ హెచ్చు గలవేమోనని అనిపించుతుంది కూడాను.

## పిట్స్‌బర్గ్

పెన్సిల్వేనియాలోని పిట్స్‌బర్గ్ పట్టణంలో ఎంతో భక్తి శ్రద్ధలతోనిర్మింపబడిన శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయం దర్శించనివారు తూర్పుకోస్తా అమెరికాలో ఉండరేమో. తమ పిల్లల అన్నప్రాశనము, అక్షరాభ్యాసం, పుట్టినరోజులు, వివాహాలు, Marriage Days, మొదలైన కార్యక్రమాలు అన్నీ భారతీయులు ప్రతి శని ఆదివారాలు అనేకమంది, అనేక తావులనుండి వచ్చి స్వామివారి సేవ కమ్మ లారగాంచి తీర్థప్రసాదాలు స్వీకరించి భారతీయ స్ఫూర్తిని హృదయాలనిండా నింపుకొని వెళ్తూంటారు. బ్రహ్మోత్సవాల సమయంలో నేను సకుటుంబ సమేతంగా వెళ్ళడం తటస్థించింది. కలశములు, నవధాన్యాల మూకుళ్ళు, మంగళహారతులు, మంగళసూత్ర ధారణ, అన్నీ మంత్రోచ్చారణలతో అర్చకస్వాములు అచ్చట కూడ శిఖ, ఊర్ధ్వపుండ్ర ధారణ ధరించి శఠగోపం ఇవ్వటం హృదయానందకరం. చివరకు అచట పంచిపెట్టిన చక్రపొంగలి కూడా ఎంతో రుచిగా ఉంటే మళ్ళీ అడిగి తినాలనిపించింది. రథోత్సవం చేసేందుకు చక్కని రంగులతో భారతీయత ఉట్టిపడేట్లుగా రథాలు ఉంటాయి.

వేరొక ప్రక్క ఆధ్యాత్మిక పుస్తకాల విక్రయం, వీడియో కేసెట్లు, వీడియోలో భారతీయ పురాణములకు సంబంధించినవి చూపిస్తారు. హరేకృష్ణ మందిరం – వెంకటేశ్వరస్వామివారి దేవాలయానికి కొంత దూరంలో అత్యద్భుతముగా భారతీయ కళా వైభవము ఉట్టిపడేలాగున విశాలమైన స్థలంలో నిర్మించిన హరే కృష్ణ మందిరంలో అనేకమంది అమెరికన్లు,భారతీయులు నల్లవారు, నామాలు పెట్టుకుని, మృదంగం వాయిస్తూ, స్త్రీలు చీరెలు ధరించి ముసుగు వేసుకుంటే, పురుషులు పంచ లాల్చీ ధరించి తావళం త్రిప్పుకుంటూ నాట్యం చేస్తూ కృష్ణభజన చేయటం, ఆ నిర్మలమైన వాతావరణంలో హృదయ ప్రశాంతతకు దోహదమిస్తోంది.

## షిర్డిసాయిబాబా మందిరం

ఇంజనీరుగా విశాఖపట్నం ప్రాంతం నుంచి వచ్చి చక్కని ఉద్యోగానికి చరమగీతం అలపించి కుటుంబ సభ్యులతో షిర్డిసాయిబాబా మందిరం నిర్మించి శ్రీ M రంగారావుగారు విరాళాలు సేకరించి షిర్డిసాయి విగ్రహానికి నిత్యసేవలు చేస్తూ నిత్య ధుని ఏర్పాటు చేసి ఎంతో కష్టించి సాయి ఆలయ వృద్ధికి పాటుపడుతుండటం ఎంతో ఆనందించదగిన విషయం. ఆంధ్రులకు గర్వకారణం. అనేకమంది భారతీయులు షిర్డిసాయి సేవలు చేసుకుంటూ ఆధ్యాత్మికోన్నతి పొంది వెళ్తూ ఉంటారు.

## అయ్యప్ప ఆలయం

ఇచటనే మరి కొంత దూరంలో అయ్యప్ప ఆలయం

# దైవ మహిమ

రాము డెరుగడే, సీతమ్మ డెమ్మన్న
చక్కని ఆ లేడి, చిక్కదనుచు ।
శ్రీ కృష్ణు డెరుగడే ! చెప్పి చూచుటెగాని !
కురురాజు తో । సంధి కుదురు దనుచు।
శ్రీ ఏసు డెలియడే శిలువ భారము మోసి
కరుణామయుండని ఖ్యాతి గనుట
శ్రీ కంతు డెరుగడే శైలవాసము వీడి
తరువు బొజ్జలో తల దాచుకొనుట ।

నాడు ఎవరు చెప్పినారు - పెదవి విప్పి
నేడు సాయి పైన నింద వేయ
దూర దృష్టి లేని దుష్ట చింతనె గాని
'దైవ మహిమ' తెలియ తరమె మనకు !

- ఏకా రామచంద్రరావు

ఉంది. ఇచట కూడ మండల దీక్ష, తదితర కార్యక్రమాలు జరుగుతూ ఉంటవి.

## విష్ణు శివ ఆలయం

వాషింగ్టన్ మెట్రో ప్రాంతంలో విష్ణు శివ ఆలయం చూడవలసిన పెద్దదైన దేవాలయం. ఇచట శని ఆది వారాలు ప్రత్యేక హోమములు, కల్యాణములు జరుగుతూ ఉంటవి. వాషింగ్టన్ సమీపంలో ఉన్నది గనుక, అనేకమంది భారతీయులు శని ఆదివారాలలో తండోప తండాలుగ వచ్చి స్వామివారి సేవలు చేసికొని తీర్థ ప్రసాదాలు స్వీకరించి వెళ్తూఉంటారు శ్రీ వేంకటేశ్వర స్వామి, అలివేలుమంగతాయారుల వివాహం పిల్లల అన్నప్రాశన, పుట్టువెంట్రుకలు, పితృకార్యాలు, అనేకమైన నిత్యకర్మలు, మొదలైనవి జరుగుతూ ఉంటవి.

అర్చకస్వాములు కూడా సరిగా మనవైపు వారివలె విభూతి, నామాలు, శిఖ, యజ్ఞోపవీత ధారణ కలిగి సాంప్రదాయసిద్ధంగా భారతీయత అడుగడుగునా ద్యోతకమౌతూ ఉంటారు. వేంకటేశ్వరస్వామి, శివ పార్వతులు, అయ్యప్ప, సత్యనారాయణస్వామి, వారల విగ్రహాలు, భక్తులు వారికి సేవలు చేసికొనే అవకాశాలు అర్చకస్వాములు ప్రతి విగ్రహం ద్ద పూజలుచేస్తూ ఉండడం విశేషం

విశాలమైన ఆడిటోరియంలో వినాయక చవితి, దసరా, సంక్రాంతి మొదలైన పండుగలు భారతీయులందరూ సమావేశమై జరుపుకుంటూ ఉంటారు. తెలుగువారు, తమిళులు, మళయాళీలు, తదితర భారతీయులందరూ, మామూలుసూటువేయకుండా, సింపుల్‌గా చొక్కాలాగూలు, స్త్రీలు చీరెలతో వస్తూఉంటారు స్వాతంత్ర్యదినోత్సవం రిపబ్లిక్ వేడుకలు ఇండియా నుండి వచ్చిన గురువుల సందేశాలకు ఈ ఆలయం కేంద్రం. స్వామి చిన్మయా నంద, ఈ మధ్యనే శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చినజియ్యర్‌స్వామివారు కూడా ఆలయాన్ని దర్శించి అనుగ్రహ భాషణం చేశారు.

## బెత్సెడా

ఇచ్చట శ్రీసత్యసాయిబాబా భజనలు ప్రతి ఆదివారమూ ఎంతో భక్తి శ్రద్ధలతో జరుపుతూ ఉండటం గమనించాను. ఆంధ్రదేశంలో ఏ ఏ పాటలు శ్రీ సత్యసాయి భజనలలో ఏఏ రాగాలతో ఏ విధంగా గానం చేస్తారో సరిగ్గా అదే విధంగా తూచా తప్పకుండగ, భారతీయులు, తెల్లవారు, నల్లవారూ అందరూ నేలమీద కూర్చుని భజన చేయటం విశేషం కంజరి, హార్మోనియం భజన గీతాలకు సహకార వాయిద్యాలుగా ఉంటాయి. ఎంతెంతో దూరంనుండి వచ్చి పెద్ద శ్రీ సత్యసాయి ఫొటో ముందు అర్చన చేసి, విభూతి తీసికుని వెళ్తూ ఉంటారు.

మంగళహారతి బాబాకు అందరూ నిలబడి సుస్వరముతో, ముక్తకంఠంతో, ఎలుగెత్తి, భక్తిప్రపత్తులతో

పాడుతుంటే తన్మయుణ్ణి అయ్యాను అమెరికాలో ఉన్నానా ? ఇండియాలో ఉన్నానా ? అనే సందేహం కలిగింది.

## బాలవికాస్

వర్జీనియాలో విశాఖ జిల్లా వాస్తవ్యులు ప్రఖ్యాత ఇంజనీరు డాక్టరు జి.వి.వి. రావుగారు తమ గృహంలో భారతీయ బాలబాలికలకు భారతీయ సంస్కృతి తెలియ జెప్పే అనేక కార్యక్రమాలు చేపట్టటం చాలా ప్రశంస నీయం చిన్నపిల్లలు పెద్దపిల్లలకు సీనియర్ జూనియర్ తరగతులలో రామాయణ భారతకథలు, మంత్రపుష్పం, శాంతి పాఠమంత్రములు ఉపనిషద్ వాక్యములు ఆంగ్ల ములో తెలుపుతూ వారికి ఆ కథలు, మంత్రముల అర్థ ములు చక్కగా విశదమయేటట్లు బాలవికాస్‌లో బోధిస్తూ ఉంటారు. శ్రీ రావుగారి సతీమణి సూర్యకుమారి వారి అమ్మాయిలు దీనికి తోడ్పడుతూ ఉంటారు.

పిల్లలకు భారతీయ నృత్యం ప్రతి ఆదివారం శ్రీమతి ఆర్. శాయికాంత బోధిస్తూ ఉంటారు. శ్రీమతి కూచిభట్ల లక్ష్మి, డాక్టరు దంపతులు, సుచిత్ర, అనంత్ గారలు తదితర భారతీయ మహిళలు ఈ కార్యక్రమా లకు చేదోడు వాదోడుగ ఉంటూ 'బాలవికాస్' ద్వారా భారతీయుల పిల్లలకు (Second Generation) ఎంతో గణనీయమైన సేవచేస్తూ ఉంటారు.

చిన్నపిల్లలకు చిత్రకళలలో పోటీలు, కథలు చెప్పటంలో పోటీలు, వక్తృత్వ పోటీలు సీనియర్ జూనియర్లకు, సంక్రాంతి, దసరా, వినాయకచవితి, దీపావళి పండుగలు స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు చేసి భారతీయుల సంతతి వారికి భారతీయతను తెల్పుతూ, భారతీయులమని గర్వించులాగున బాలవికాస్ కార్య క్రమలు చేయటం ముదావహం.

)-○-(

# యదార్థాన్ని తెలుసుకుని ఆచరించు

ఒకానొకప్పుడు మినపాలిస్ నగరం(యు.ఎస్.ఎ ) లో నున్న ఒక స్థితిమంతురాలైన యువతి కడకు ఒక మోసగాడు వెళ్లి ఒక లాభప్రదమైన వ్యాపార సంస్థలో ఆమె సొమ్మును పెట్టుబడిగా పెట్టమనియు, అందు ఎన్నో సంస్థలకన్న లాభములార్జించవచ్చునని, ఆమెను నమ్మించి, ఆమెకున్న యావదాస్తిని అందు పెట్టించెను. కొలది కాలానికి వాడు తన ఉనికిని మార్చివేసి పరారయి పోయాడు అపుడామె పట్టణములోనున్న ' బెటర్ బిజినెస్ బ్యూరో ' కు తన కేసును నివేదించింది. అపుడా కార్యాలయంలో పనిచేస్తున్న ఒక ఉన్నతోద్యోగి ఆమెతో ' మేము ప్రజలకు అందిస్తున్న సేవలు సర్వ జన విదితమేగదా! ముందరే మా వద్దకు మీరు ఎందుకు రాలేదు ? ' అని ప్రశ్నించాడు.

అపుడామె 'నాకు పూర్తిగా తెలుసు ' అన్న సమాధా నంతో అక్కడున్న అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. అంతేకాదు తానేమి చేయదలచుకున్నానో, ముందుగా మీకు చెప్తే మీరు వద్దంటారేమోనని భయపడ్డాను '

ఈ ప్రపంచంలో ఎటు జూచినా ఇదే తంతు. మనుష్యులు సమస్యల్ని ఎదుర్కొనేందుకు భయపడు తున్నారు ఎందుకు ? యదార్థం ఎప్పుడూ ఆమోద యోగ్యంగా, ఆచరణీయంగా, లాభప్రదంగా కనపడదు. కాని ఒక్క క్షణం తీరికగా ఆలోచిస్తే ప్రతివ్యక్తికీ తేటతెల్లమౌతుంది. ఎప్పుడూ సత్యమే మానవుణ్ణి బ్రతికించగలదనీ, రక్షింపగలదనీ, ఎండ మావుల నుండి బయట పడేయగలదనీను - అవునా ?

**- కామరాజు సరోజనీదేవి**

# బద్ధకం పరమ శత్రువు

-కొమరగిరి కృష్ణమోహనరావు

" అలసస్య కుతో విద్యా
అవిద్యస్య కుతో ధనం
అధనస్య కుతో మిత్రం
అమిత్రస్య కుతస్సుఖమ్ "

సోమరికి విద్య ఎట్లు లభించును ? విద్య లేనివానికి ధనమెట్లు లభించును ? ధనము లేనివానికి మిత్రుడెట్లు లభించును ? మిత్రుడు లేనివానికి సుఖమెట్లు లభించును? అని ఈ శ్లోకార్థము. సోమరికి విద్యరాదు, బద్ధకస్తునికి విద్య వంటబట్టదు. అలసత్వం సుఖానికి పరమ శత్రువు. సోమరికి భవిష్యత్తులేదు. మానవుని ప్రగతికి బద్ధకం పరమ శత్రువు. సోమరితనం అన్ని అరిష్టాలకు మూలకారణం

సోమరితనమే తుప్పు ధూళి. అయితే ఈనాటి విద్యార్థులలో సోమరితనం నానాటికి ప్రబలిపోతున్నది. బద్ధకం పెచ్చు పెరిగిపోతున్నది. శుభ్రత లేకుండా పోతున్నది. తన దుస్తులను, తన వస్తువులను, తన ఇంటిని, తన పరిసరాలను శుభ్రంగా వుంచుకోలేని పరమ బద్ధకస్తులు దేశాన్ని ఏవిధంగా సంస్కరించ గలరు ? ఇట్టి సోమరులు దేశమునకు ఏవిధమైన ఆదర్శ మును అందించగలరు ?

అసలు సోమరి తల దయ్యాలకొంప అనే సామెత కూడా ఉన్నది పని లేనివానికి అనేక రకములైన పిచ్చిపిచ్చి ఆలోచనలు వస్తుంటాయి. బద్ధకస్తుడు ఏ పనీ చేయలేడు "రేపు చేద్దాములే" అని ఎప్పటి కప్పుడు వాయిదా వేయటం అతని సహజ ప్రవృత్తి. చేద్దామని నిర్ణయించుకొనిన తరువాత వాయిదా వేయ కూడదు. నిర్ణయించుకున్న తక్షణమే ఆచరణలో పెట్టాలి అయితే మొట్టమొదట బుర్రతో ఆలోచన చేయాలి. తరువాత దానిని హృదయంతో పరిశీలన చేయాలి. తదుపరి చేతులతో దానిని ఆచరణలో పెట్టాలి. " ఆలోచన, పరిశీలన, ఆచరణ " – దీనినే "త్రికరణ శుద్ధి" అన్నారు మన పెద్దలు. అయితే బద్ధకస్తుడు ఆలోచన చేయలేడు, పరిశీలన చేయడానికి ముందుకురాడు. ఆచరణలో అసలు పెట్టనే పెట్టలేడు, కనుక అటువంటి పరమ బద్ధకస్తులు, సోమరిపోతులు జీవితంలో దేనినీ సాధించలేరు.

" ఆలస్యం హి మనుష్యాణాం, శరీరస్థో మహాన్ రిపుః " ఆలస్యమనేటటువంటిది మనుష్యుల శరీరంలో నున్న గొప్ప శత్రువు. ప్రతి పనిని ఆలస్యంగా చేయటం బద్ధకస్తుని సహజ లక్షణం. 'ఆలస్యం అమృతం విషం' అన్నారుగదా! మనపెద్దలు. కనుక మంచి పనులు చేయటంలో ఏమాత్రం ఆలస్యం చేయరాదు. బద్ధకంతో ఆలస్యం చేస్తే కావలసిన పనులు కూడా కావు.

"సోమరితనం బద్ధకం, చిగర్చని, పూయని, కాయని చెట్టువంటిది" అని ఏనాడో మన పెద్దలు శలవిచ్చారు పిల్లలు కనని స్త్రీని ఏవిధంగా గొడ్రాలని నిందిస్తారో ! అదే విధంగా చిగురువేయని, పూలు పూయని, కాయలుకాయని చెట్టును కూడా నిందిస్తారు. అటువంటి చెట్టుకూడా వంటచెరుకుగా ఉపయోగపడుతుంది గాని సోమరి, బద్ధకస్తుడు మాత్రం తనకు తానూ ఉప యోగపడడు, పరులకు అంతకన్నా ఉపయోగపడడు.

సమాజానికి అతని వలన ప్రయోజనం లేకపోగా ప్రమాదం కూడాను. ఒక్క మాటలో చెప్పాలంటే బద్ధకస్తుడు చెల్లని నాణెం వంటివాడు.

" బద్ధకము సంజ నిద్దుర
వద్దు సుమా దద్దరంబు వచ్చున్ దానన్
గద్ది తురింటివారలు
మెద్దందురు తోడివారు ముద్దుకుమారీ ! "

అని కుమారీ శతకంలో చెప్పబడింది. అనగా సూర్యోదయ, సూర్యాస్తమయ కాలములయందు నిద్దుర పోయేవారిని బద్ధకస్తులంటారు. అట్టి వారిని చూచి పెద్దలు కోపంతో మందలిస్తారు, విసుక్కుంటారు. పాటివారు హేళన చేసారు. చదువు సంధ్య రాని మొద్దని నిందిస్తారు. కనుక బద్ధకం మానవునికి పరమ శత్రువు ప్రగతికి అది అవరోధం.

"ఆరోగ్యమే మహాభాగ్యము" అన్నారు గదా ! బద్ధకస్తుని ఆరోగ్యం కూడా దెబ్బతింటుంది ఏ పనీ చేయకుండా కడుపు నిండా మెక్కి పడుకుంటే అది అరుగదు, అజీర్ణరోగం కూడా వస్తుంది. ఆరోగ్యం దెబ్బ తింటుంది. అప్పుడు విచారించినా, ప్రయోజనం ఉండదు. ఈనాడు చాలామంది " దున్నేటప్పుడు దూడల్లో, మేసేటప్పుడు ఎద్దుల్లో " లాగే ఉంటారు అట్టివారిని తిండిబోతులు, బద్ధకస్తులంటారు. ఇటువంటివారు సమాజం పాలిటి చీడపురుగులు.

ఈనాడు మానవుడు కడుపుకు దాసుడై, నాలుకకు సేవకుడై, తన కాళ్ళకు చేతులకు తానే సంకెళ్ళు తగిలించుకున్నాడు అనారోగ్యానికి గురియైపోతున్నాడు. బద్ధకంతో బంగారంలాంటి జీవితాన్ని పాడు చేసుకుంటున్నాడు భవిష్యత్తును అంధకారం బంధురం గావించుకుంటున్నాడు. నిరాశా నిస్పృహలతో కృంగిపోతున్నాడు కనుక బద్ధకమును దరిచేరనీయకండి ! దానిని దూరంగా తిరిగిరాని తీరాలకు పారద్రోలండి ! భవిష్యత్తును తీర్చిదిద్దుకోండి ! ఈ మానవ జీవితాన్ని సార్థకం చేసుకోండి ! ( ఆకాశవాణి సౌజన్యంతో )

## అశాశ్వతమైనవాటిని చూచి మురిసిపోకు !

శ్లో॥ సంపద స్వప్న సంకాశా ।
యౌవనం కుసుమోపమే ।
విద్యుచ్చంచల మాయుష్యం ।
తస్మా జ్జాగ్రత జాగ్రత.

సంపదలు స్వప్న పదార్థములవంటివి అనగా అశాశ్వతములు యౌవ్వనము కుసుమమువంటిది అనగా త్వరలో వాడి నశించు స్వభావముకలది. ఆయువు మెరపు వలె చంచలము. అనగా నశించు స్వభావం కలది. కావున మేల్కొని ఇహ సంబంధములగున వన్నియు అశాశ్వతములు గాన శాశ్వతమగు మోక్ష సామ్రాజ్యమును పొంద యత్నించుము అందుకొరకే నీకీ శరీరము బంధువులు, సంపద, సాధన సామాగ్రిగ నియ్యబడినవి. గాన వాటికి మురిసిపోయి, లోనయి దుఃఖమయమగు సంసార చక్రమున పరిభ్రమించుటకు గాదు.

- సేకరణ : కపుల ఆంజనేయ శర్మ

# సంస్కృతిని మరిచిపోవటమే మన క్షీణత

—— ఆర్. యస్. కె. మూర్తి

క్షీణ సంస్కృతి– ఈ పదాన్ని తరుచుగా పత్రికల వారు వాడుతుంటారు. ఈ మధ్య కిడ్నీల వ్యాపారానికి సంబంధించిన కొన్ని బాధాకరమైన వివరాలు వెలుగు లోకి వచ్చినై కదా! ఏ రక్తమో యిస్తామని వచ్చిన వారికి మత్తుమందు యిచ్చి, వారి మూత్రపిండాలను కత్తిరించివేస్తున్నారుట వాటిని ప్రధానంగా అరబ్బు దేశాలవారికి అందజేస్తున్నారుట. ఒక్కొక్క కిడ్నీని లక్ష, రెండు లక్షలకు అమ్ముతారుట. అట్లా కిడ్నీని పోగొట్టుకున్నవారిలో కొందరికి అది తాము పోగొట్టుకున్నామని కూడ తెలియదట. ఇటువంటి అమానుషపు వ్యాపారంలో పెద్దపెద్ద డాక్టర్లు కూడ భాగస్వాములవుతున్నారుట! ఇదంతా మన క్షీణసంస్కృతికి ప్రతిబింబమని కొందరు వ్యాఖ్యానించారు.

ఇట్లాంటివే మరెన్నో దారుణాలు మనకు పత్రికల ద్వారా తెలుస్తూనే ఉన్నాయి. బెంగుళూరులో అంతరిక్ష పరిశోధనా కేంద్రం ఒకటుంది. మన అంతరిక్ష శాస్త్రజ్ఞులు ప్రపంచ విజ్ఞానవేత్తలతో విజయవంతంగా పోటీపడుతున్నారు. ఎన్నెన్నో నూతన విషయాలను పరిశోధించి కనుగొంటున్నారు. అటువంటిచోట పని చేసే కొందరు ఉన్నతులైన శాస్త్రజ్ఞులు పరిశోధకులు మన దేశం కనుగొన్న అంతరిక్ష రహస్యాలను పొరుగు దేశానికి అమ్మివేస్తున్నారన్న ఆరోపణలకు గురి అయ్యారు. వారితోపాటు కేరళ రాష్ట్ర పోలీసు డైరెక్టరు జనరల్ కూడ అట్టి ఆరోపణలకు గురి అయ్యారు. కొన్ని లక్షల రూపాయలకోసం దేశపు శాస్త్రజ్ఞుల శక్తి సంపదలనే అమ్మివేయ జూచారన్నమాట ఇదంతా క్షీణ సంస్కృతి క్రిందకే వస్తుందంటారు కొందరు పత్రికలవారు

## క్షీణ సంస్కృతేనా ?

అయితే సంస్కృతిలో క్షీణ సంస్కృతి అనీ, మెరుగైన సంస్కృతి అనీ రకాలుండవు ఆయా కాలాల ఆలోచనా ధోరణుల్లో మెరుగు, తరుగులు ఉండవచ్చు. సర్వకాలాలకు మెరుగైన ఆలోచనా ధోరణి ఏదో అదే మన 'సంస్కృతి' అవుతుంది ఉదాహరణకు తల్లి తండ్రులు బిడ్డలను ప్రేమించటం బిడ్డలు తల్లితండ్రులను గౌరవించటం ఈ ఆలోచన వెనుక ఉన్నది సెంటిమెంటు మాత్రమే కాదు. మనదైన ధర్మం దీనికి ప్రాతిపదిక. ఇట్లా ధర్మం ప్రాతిపదికగా రూపొందిన ఆలోచనా ధోరణి మన సంస్కృతిలోని అంశం అవుతుంది

అట్లాగే అర్ధకామాలను ధర్మమార్గములో పండించుకొని, మోక్షగాములై చరించాలనేది మన ధర్మం. ధర్మార్ధ కామమోక్షాలని అంటాం. అర్ధ, కామాలకు ధర్మమోక్షాలను గట్లుగా నిలుపుకున్నారు ఆ గట్ల మధ్యనే అవి ప్రవహించాలి. గట్లని కాదంటే అది నిలయమ్.

అందుకే ఒక్క భార్య తప్ప మిగతా అందరూ మనకు తల్లులూ, చెల్లెళ్ళే అనేది మన సంస్కృతి. స్వామి వివేకానందను పరీక్షించటానికై నగ్నంగా ఒక యూరోపియన్ వనిత వస్తే వారామెను "అమ్మా" అని సంబోధిస్తామన్నారు. తన సైనికులు దర్మార్గంగా చెరపట్టిన ముస్లిం వనితను శివాజీ మహారాజ్ 'తల్లీ'

అని సంబోధించి ఆమెను సత్కరించి, సాదరంగా పంపించాడు.

## ధనార్జన కూడా ధర్మబద్ధమే

ఆట్లాగే ధనార్జన ఎట్లా జరుపుకోవాలో కూడా మన ధర్మం మనకు మార్గ నిర్దేశనం చేసింది. 'ఈశావాస్య మిదంసర్వం_అన్న ఉపనిషత్ వాక్యంలో సంపద అంతా దైవానిది అందులో నీకెంత కావాలో అంత తీసుకొని అనుభవించు అవసరాలను మించి తీసుకోకూడదు. అవసరాలను పెంచుకోకూడదు. ఇదీ మన సంస్కృతి.

కాని అర్థ కామాల విషయంలో పాశ్చాత్యుల ఆలోచనా ధోరణి వేరు. వాటి విషయంలో వారిని ధర్మం శాసించదు. భౌతికమైన అంశాలేవో వారి ఆలోచనలను ప్రభావితం చేస్తాయి

నేడు మన సమాజం మన సంస్కృతిని, మన ధర్మాన్ని విస్మరించి ప్రవర్తిస్తున్నది భౌతిక సుఖలాలసత్వం ప్రాతిపదికగాగల పాశ్చాత్య నాగరికత ఒక వ్యామోహంగా మనలను పీడిస్తున్నది వస్తు వినిమయవ్యామోహం నేడు మనలను కట్టికుదపుతున్నది. రేపు ఏమవుతుందో నన్న అభద్రతా భావం మనలను మరింతగా ధర్మచ్యుతులను చేస్తున్నది. అర్థ కామాల విషయంలో మనం ధర్మం ప్రాతిపదికగా గల మన సంస్కృతిని కాదంటున్నాం భౌతిక దృక్పథమైన పాశ్చాత్య నాగరికతకు దాసులమవుతున్నాం.

కిడ్నీలనమ్మగా వచ్చే డబ్బుతో డాక్టర్లు ఏం చేస్తారు? మరో మేడ కట్టించుకుంటారు. ఇంకో కారు కొనుక్కుంటారు. గదులనిండా గోడనుంచి గోడకు కార్పెట్లు పరిపించుకుంటారు. విలాస వస్తువులతో యింటినీ వంటినీ నింపుకుంటారు పదిమంది స్త్రీలతో అక్రమసంబంధాలు పెట్టుకుంటారు ఇందులో ఏదీ మన సంస్కృతికి చెందిన అంశం కాదు. ఇవేవీ మన 'క్షీణ సంస్కృతి' లోని అంశాలు కావు.

నిత్య కళ్యాణాలు నిరతంబు పచ్చతో
రణ పంక్తులే సాయి ప్రాంగణాలు
గాంధర్వ సంగీత గాన తరంగాలు
భజన పాటల దివ్య భక్తిఝరులు
యాత్రికా వాసాలు యానందనిలయాలు
చిన్మయానందన చేతనములు
ఉద్యమ స్ఫూర్తుల యుత్తమాదర్శాలు
అమ్మ యొడిని చేరు నాశయాలు
సగుణ భక్తి విధానాల సౌరభాలు
చేరు భక్త జనావళి చిత్తములకు
పర్తిపురవాస। మహిమన్ పాడుకొందు
హృదయ పుష్పాంజలులివె సాయీమహేశ।

**- పంచాంగము శీనప్పశాస్త్రి**

---

ఎందుకంటే యిదంతా వికృతే తప్ప, సంస్కృతో, దాని క్షీణ రూపమోకాదు చక్కనమ్మ చిక్కినా అందంగానే ఉంటుంది ధనార్జన తప్పుకాదు ధర్మమార్గాన ఎంతైనా సంపాదించు, ధర్మానికై దానిని వినియోగించు. ఆధునిక విజ్ఞాన శాస్త్రం అద్భుతమైన సౌకర్యాలను మానవునికి అందుబాటులోకి తెస్తున్నది. కిడ్నీలు, గుండెకాయ, కళ్ళు - యిట్లా అవయవాల మార్పిడిని శాస్త్రం సుగమం చేసింది. ధర్మబద్ధంగా యిదంతా జరిగితే సమాజానికి చెరుపుఏముంటుంది? ధర్మం మనలనుశాసించినంతవరకు మన పనులన్నీ పరులకు హితవు కలిగించేవే అయిఉంటాయి ఆట్లా ధర్మబద్ధంగా మెలగాలనుకోవటం అదే మన సంస్కృతి దీనికి మినహాయింపులు లేవు, క్షీణ రూపం లేదు

అట్టి సంస్కృతీ నిబద్ధతను యువత నేర్చుకోవాలి. మహనీయుల, మహాత్ములయందు భక్తి శ్రద్ధలతో సదసద్వివేకంతో 'పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం' పదే పదే మనలను శాసించవలసిన ప్రబోధమిది.

# సింధు నాగరికత

భండారు పర్వతాలరావు

సింధు రాష్ట్రంలో 1850 ప్రాంతంలో రైలు మార్గం నిర్మించాలని అనుకొన్నారు. దానికి కావలసిన గరస, కంకర అక్కడ దగ్గర్లో దొరకవు. ఏం చేయటమా అని ఆలోచిస్తుంటే కొందరు అక్కడకు దగ్గరలో బ్రాహ్మణాబాద్ అనే పాడుబడ్డవూరిలో పాటిదిబ్బలున్నాయని చెప్పారు. వాటిని తవ్వగా యిటుకల దొంతర్లు బయటపడ్డాయి. దాదాపు 160 కి. మీ. రైలుకట్టకు కంకర సమస్య తీరింది. కాని తాము ఎంత విలువైన పురావస్తు అవశేషాలను నాశనం చేశారో వాళ్లు గ్రహించలేదు. అప్పటి బ్రిటీషు ప్రభుత్వం పట్టించుకోలేదు. ఆ తరువాత 1920 దరిమిలా జరిగిన తవ్వకాలు, పరిశోధనల ఫలితంగా ఆ అవశేషాలు క్రీ పూ. 2500 సం॥ ల ప్రాంతంలో వర్ధిల్లిన సింధునాగరికతకుచెందినవనితేలింది.

బ్రాహ్మణాబాదు దగ్గర వున్న వూరి పేరు మొహంజోదారో - అంటే 'మృతుల పర్వతం' అని అర్థం. హరప్పా, మొహంజోదారోల దగ్గరే కాక, ఈ నాగరికత అవశేషాలు దాదాపు 100 ప్రాంతాలలో కన్పించాయి. అందులో కొన్ని భారత్, పాకిస్తాన్‌లలో వున్నాయి. మరికొన్ని ఈజిప్టు, ఇరాక్‌ల దాకా విస్తరించాయి.

ఈ పట్టణాలను ఒక నిర్దిష్ట ప్రణాళిక ప్రకారం కట్టారు. బజార్లు ఉత్తర - దక్షిణాలుగాగాని తూర్పు, పడమరలుగా గాని వుండి ఒకదానినొకటి సమ (90°) కోణంలో ఖండించుకుంటాయి ఇండ్లు కూడా ఒకే విధమైన ప్లానుతో (గవర్నమెంట్ క్వార్టర్స్ కట్టినట్లు) కట్టబడ్డాయి చక్కగా కాల్చిన పెద్దసైజు యిటుకలను యిండ్ల నిర్మాణానికి వినియోగించారు. నిర్మాణంలో నగిషీలు, అలంకారాలు కన్పించవు ధనికుల యిండ్లకు బీదవారి యిండ్లకు తేడాఅల్లా ధనికుల లోగిళ్లు మరికొంత విశాలంగా వుండటమే. ఏ యింటినైనా యిష్టంవచ్చినట్లు పెంచి కట్టటానికి లేదు. ఏ కారణం చేతనయినా యింటిని పడగొట్టి కడితే తిరిగి అదే ప్లాను ప్రకారం కట్టాల్సిందే కాని మార్చటానికి వీల్లేదు.

అన్నిటికన్నా ముఖ్యమైంది పట్టణ నిర్మాణంలో చోటుచేసుకొన్న డ్రైనేజి విధానం ఇటుకలతో తీర్చి కట్టిన మురుగు కాలవలు, మధ్య, మధ్య బరువైన చెత్త దిగిపోవటానికి వీలుగా అమర్చిన గోతులు ఆధునిక అండర్ గ్రౌండ్ డ్రైనేజీని తలపిస్తాయి. ఆ గోతులను తెరచి అందులోని చెత్తను మధ్య మధ్య తొలగించటం ద్వారా కాలువ పూడిపోకుండా వుంటుంది

నగరంలో ఏదైనా దేవాలయం వున్నట్లు కన్పించదు. అయితే ఒక నిర్మాణం దేవాలయం కావచ్చునని అనుమానిస్తున్నారు నగరం మధ్యన 'స్నానశాల' ప్రత్యేకంగా పేర్కొనదగింది. అందులోని 'ఈతకొలను' లోనికి నీరు నింపేందుకు, ఉపయోగించిన నీటిని ఖాళీ చేయించేందుకు పక్కా ఏర్పాట్లున్నాయి చెప్పుకోదగ్గ మరో నిర్మాణం ధాన్యాగారం

మొహంజోదారో, హరప్పాల వద్ద అనేక ముద్రలు (సీళ్లు) లభించాయి వీటిమీద వున్న లిపిని ఇంతవరకు 'చదవ' లేకపోయారు. ఇలాంటి అక్షరాలు 400దాకా లభ్యమయాయి అవి కంప్యూటర్‌కు కూడ లొంగలేదు.

బజార్లను, ఇండ్లను అలా ఖచ్చితమైన ప్లాను ప్రకారం నిర్మింపజేసిన కట్టుబాటు వెనక నిరంకుశ రాజరికపు హస్తం వున్నదా ? లేక మతాధిపతి నిర్ణయమా ? అలా కిలోమీటర్ల పర్యంతం వరుసలు, వరుసలుగా ఏ తేడా లేకుండా, అలంకార రహితంగా ఇండ్లను బజార్లను ఎందుకు నిర్మించారు? ఆనాటికే పారిశుధ్యపు ఏర్పాట్లను అంత చక్కగా నిర్వహించిన ఆ నాగరికత ఎలా ఉద్భవించింది? ఎలా అభివృద్ధిచెందింది? ఎలా, ఎందుకు, ఎప్పుడు అంతరించింది ? ఆ సీళ్ళపై లిపి ఏ భాషకు చెందింది ? - ఈ ప్రశ్నలకు జవాబు సాధించాల్సిన బాధ్యత పరిశోధకులదే. 

# కొమరగిరి కారాగారలేఖలు

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 3-1-1977

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలో "ఆత్మ జ్ఞానము" గురించి వివరించాను. ఈ లేఖలో లౌకిక విద్యల అవసరమును గురించి వివరిస్తాను.

## లౌకిక విద్యలను విడువరాదు

ప్రస్తుత ప్రపంచంలో "ఆత్మ జ్ఞానము" ను సంపాదించడం అంత తేలికైన విషయంకాదు. ఇది అందరికి సాధ్యం కూడా కాదు. అసాధ్యమని భావించి నిరాశ నిస్పృహలతో ప్రయత్నాన్ని మాత్రం విడువరాదు భౌతిక, ప్రాపంచిక విద్యలు లేకపోయినప్పటికినీ, "ఆత్మజ్ఞానము" ను సంపాదించడానికి అవకాశం వున్నమాట వాస్తవమే. ఒక్కొక్క సమయంలో పరమాత్మను తెలుసుకోవాలనే తాపత్రయంలోపడి లౌకిక విద్యలు విడనాడటం జరుగుతుంది అటు పరమాత్మను తెలుసుకోలేక, ఇటు భౌతిక విద్యలనభ్యసించక "రెంటికి చెడ్డ రేవడి" లాగే ఉభయ భ్రష్టులవుతుంటారు కొందరు అది ఏమాత్రం మంచిది కాదు. భౌతిక విద్యలకు ఏమాత్రం నిర్లక్ష్యం చేయరాదు. లౌకిక విద్యలు లేకుండా వుండటం కంటే, వాటిని కూడా కలిగివుండటం శ్రేష్ఠమూ, శ్రేయస్కరము. ఒక చంప భౌతికశాస్త్ర విజ్ఞానమును సంపాదిస్తూ, ఆధ్యాత్మిక దృష్టి కూడా కలిగివుండటం మంచిది. ప్రతి రోజూ కొంత సమయమును భగవద్ధ్యానమునకు కేటాయించడం ఉత్తమం

తపస్సు : 'తపస్సు' అనగానే చాలామందిలో ఒక భయం ఉన్నది. అన్నాహారములను విసర్జించి, ఆకులలములను తినుచూ, వాయుభక్షణచేస్తూ, కీకారణ్యములలో తల క్రిందబెట్టి, కాళ్లు పైకిపెట్టి సంవత్సరముల తరబడి ఉండటం అనే భావం ఉన్నది. ఆ భావాన్ని గీతలో భగవానుడు ఏనాడూ చెప్పలేదు. తనయందున్న రజో తమోగుణములను తపింపజేసి, నిర్మూలన మొనర్చుటయే "తపస్సు" అని గీతలో నిర్వచనం చెప్పబడింది తపస్సును మూడు విధములుగా వర్ణించాడు భగవానుడు. 1. శారీరక తపస్సు. 2. వాచిక తపస్సు. 3. మానసిక తపస్సు. 1. శారీరక తపస్సు అనగా 1. దేవతలను, గురువులను, బ్రహ్మనిష్ఠులను, జ్ఞానులను గౌరవించి పూజించుట 2. బాహ్యాభ్యంతర శుచిత్వం. 3 కుట్రలు, కపటం లేకుండుట. 4 బ్రహ్మచర్యము 5 అహింస. 2. వాచిక తపస్సు అనగా 1. మనం మాట్లాడే మాటలతో పరుల మనస్సును నొప్పింపరాదు సత్యమైన మాట అయి ఉండాలి సత్యవాక్కు అయినప్పటికినీ, పరుషం, అప్రియంగా పలుకరాదు మన వాక్కు ప్రియముగా, హితముగా వుండవలెను. 2 వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత, భారత భాగవత రామాయణాదులను అధ్యయనం చేయవలెను. 3. మానసిక తపస్సు అనగా 1. మనస్సు నిర్మలంగా వుంచుకొనుట, ముఖమును ప్రసన్నంగా వుంచుకోవలెను. 2. ఆత్మనిగ్రహం కలిగివుండాలి, ఈ మూడు తపస్సులను ఆచరించిన యెడల అహంభావం చచ్చి పెద్దల అనుగ్రహం సంప్రాప్తమగును. హృదయము నిర్మలమగును. విశాల భావము అలవడును. ప్రేమ, కరుణ, దయ, దానం, త్యాగం, పరోపకారం - మొదలగు సద్గుణములు సంప్రాప్తమగును. చిత్తశుద్ధి ఏర్పడును. అట్టి నిర్మల హృదయముననే జ్ఞాన భాస్కరుడు ఉదయించును ఇటువంటి పరమోత్తమ

మైన, మహోత్కృష్టమైన భావాలను మన శాస్త్రాలు బోధిస్తున్నాయి మన మహర్షులు, తత్త్వవేత్తలు ఇవే భావాలను ప్రబోధిస్తున్నారు. కనుక ప్రతి ఒక్కరూ ఇటువంటి పరమ పవిత్రమైన భావాలను ఆకళింపు జేసుకుని, జీర్ణం చేసుకొని, ఆచరణలో పెట్టి కృతకృత్యులు కావలెను చిరంజీవులకు నా ఆశీస్సులు

ఇక ఉంటా... ఇట్లు

# శ్రీ సత్యసాయి దివ్యలీలలు

## భక్తుల అనుభూతులు

నా భార్యకు మూడు ఆపరేషన్లు జరిగినాయి. వెన్నుపూస చితికి చెదిరి క్రింద కూర్చోటానికి గాని, వంగి పని చేయుటకుగాని చాలా యిబ్బందిగా ఉండేది. దాదాపు 18 సంవత్సరాలుగా బాధపడుతూవస్తున్నది. ఎంతోమంది డాక్టర్లు మందులిచ్చారు. ప్రయోజనం లేకపోయింది. బ్రతికినన్నాళ్ళు ఈ విధంగా అవస్త పడాల్సిందేనని డాక్టర్లు చెప్పారు మేము భగవాన్ శ్రీ సత్య సాయి బాబావారి భక్తులము. జనవరి '94 సేవలలో పాల్గొనడానికి పుట్టపర్తి వెళ్లాం నా భార్యను కూడా తీసుకొనివెళ్లాను. ఆమెచేయదగ్గ సేవే యిచ్చినారు. సేవాకార్యక్రమాలు అయిన తరువాత మా సేవాదళ సభ్యులకు ది 16-1-1994 న స్వామి పాదనమస్కారం ఇస్తారని చెప్పగా పురుషులు, మహిళలు విడివిడిగా కూర్చున్నాం మొదట పురుషులకు స్వామి పాద నమస్కారం యిచ్చి తరువాత మహిళలకు యివ్వటం పరిపాటి అయితే ఆ రోజున మహిళలకే ముందు యివ్వటం విశేషం. నా భార్య క్రింద కూర్చోవటం కష్టంకదా ! నాల్గు దుప్పట్లు మడతపెట్టి, నడుముకు బెల్టు చుట్టబెట్టుకొని, అతికష్టంమీద కూర్చున్నది. ఆ రోజున స్వామి సరాసరి నా భార్యదగ్గరకు వచ్చి, పలుకరించి, పాదనమస్కారం యిచ్చి ఆశీర్వదించి వెళ్లారు. అంతే.... తొలగిన వెన్నుపూసలు, సరియైన సానంలోనికివచ్చాయి. నొప్పి పోయింది. తన పనులు తానే చేసుకుంటున్నది. ఆనాటినుంచి సాష్టాంగనమస్కారం కూడా చేయగలుగుతున్నది నడుము వంచి అన్ని పనులు చేసుకుంటున్నది. డాక్టర్లకు చూపించుతే "వెన్నుపూస సరియైన స్థితిలోనికి వచ్చింది మీరు ఎక్కడ వైద్యం చేయించారు ?" అని అడిగారు. స్వామి స్పర్శతో, సంభాషణతో ఆ స్థితికి వచ్చిందని చెబితే డాక్టర్లు ఆశ్చర్యపోయి స్వామి భగవంతుడేనని ఒప్పుకున్నారు సాయి సర్వాంతర్యామి. ఎవరికి, ఎప్పుడు, ఏమి యివ్వాలో దానిని అనుగ్రహిస్తుంటారు. అర్హత వున్న వారికి సాయి అనుగ్రహం లభిస్తుంది అట్టి అర్హతను సంపాదించుకోవడానికి కృషి చేయాలి. కృషి వుంటే దైవ కృప ఉంటుంది.

ఓం సాయిరాం

- పసుమర్తి మంగేశ్వరరావు
పోడూరు - 534 327
ప॥ గో॥ జిల్లా

( గమనిక : భక్తులు స్వామితో కలిగిన అనుభూతులు క్లుప్తంగా వ్రాసిపంపుతుంటే శ్రీవాణిలో ముద్రింపుతాము
- సం)

# విశాఖ సముద్రతీరంలో ఖగోళ, ఆరోగ్య, ఆధ్యాత్మిక, జ్ఞానకేంద్రం

— యన్. బి. యస్. రామారావు

ఈ ధ్యానకేంద్రముమ 'Harmony' అనీ లేదా " Planetary Healing Centre " అనీ ఆంగ్లంలో పిలుస్తారు ఇటువంటి ధ్యానకేంద్రం ఇండియాలో ఇదే తొలి కేంద్రంగా నిర్మింపబడింది. విశాఖపట్నం లోని బీచ్ రోడ్డులో— భీమిలి వైపు విశాఖ నుండి 5వ కి. మీ. దగ్గఱ 'సిద్ధాశ్రమం' అనే 10 ఎకరాల వనంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆశీర్వాదంతో ; శ్రీ కె పార్వతీకుమార్ గారి ఆధ్వర్యంలో శ్రీ బి. ప్రభాత్‌కుమార్‌గారిచే ఈ హార్మనీ నిర్మింపబడి, ది 10-1-1995 న 'ఇండోర్' కి చెందిన శ్రీ భక్తరాజ్ మహారాజ్‌బాబావారి చేత : ఢిల్లీకి చెందిన శ్రీ సాయిదాస బాబావారి చేత ; వేదసాంప్రదాయములతో ఆవిష్కరింప బడింది.

ఒక పెద్ద మిఠాయి పొట్లం బోర్లించబడినట్లుగా ( Inverted Cone ) శంఖు బోర్లించినట్లుగా, క్రింద 49 అడుగుల వ్యాసము కలిగి, 49 అడుగుల ఎత్తు కల్గిన పక్కా R C C భవన నిర్మాణం ఇది ఖగోళశాస్త్రమును ఆధారము చేసికొని ఈ కేంద్రం నిర్మింపబడినది. ఇందులో ధ్యానం చేసినవారికి శారీరక రోగములన్నియూ నిర్మూలింపబడుటయేకాక, ఆధ్యాత్మికశాంతి, ఉన్నతి కూడా లభించును. దీనిని "Auto Healing Centre" అని అంటారు. ఇటువంటి అద్భుత నిర్మాణం ఇండియాలో ఇదే ప్రప్రథమం ఈ భవనంలో పైన శిఖరంవద్ద చిన్న రంధ్రం ఆకాసంలోకి వదలిపెట్టబడింది. సరిగా భూమిపై భవనంలో అదే రంధ్రమునకు క్రిందగా అయస్కాంతశక్తిగల లింగాకారపు 'Pedastral' పై 'అర్జంటీనా' దేశంనుంచి తీసికొని రాబడిన 17 Kg ల బరువు కల్గి, సుమారు 7" వ్యాసము కలిగిన నీలిరంగు క్రిస్టలు అమర్చబడింది. సంవత్సర కాలంలో ఒకరోజున సూర్యకిరణములు ఈ రంధ్రం గుండా క్రిందనున్న నీలిరంగు క్రిస్టలుపై పడునట్లు అమర్చబడింది. నిత్యం ఈ కేంద్రంలో ఆటో టేపు రికార్డర్ ద్వారా 'ఓం'కారము ఉచ్చరింపబడుతూ వుండును. అట్టి ఓంకారము ప్రతిధ్వనిస్తూ, హార్మనీ లోనికి ప్రవేశించిన వారి మనస్సు ఆధ్యాత్మికశాంతి లోనికి తీసికొనిపోయి, ప్రాపంచిక విషయములు మరచి పోవునట్లు: భగవదనుగ్రహము పైనుండి క్రిందనున్న వారికి దిగివచ్చునట్లు చేయగల శక్తి ఈ నిర్మాణములో అమర్చబడినది ఈ భవనము క్రింద వృత్తాకారముగ నుండుటచే ఆ వృత్తములో 8 స్తంభములపై బోర్లించిన శంఖువలె పైభాగము (కప్పు) అమర్చబడి 8 స్తంభముల మధ్యభాగము 7 భాగములుగ (7 Panels) విభజింపబడి బయటనుంచి 7 కాంతికిరణములు భవంతి లోనికి వచ్చునట్లమర్చబడినది. సూర్యకిరణములు 7 గ పేర్కొనబడినవి సూర్యుని చుట్టు తిరుగు గ్రహములు 7 సంగీతములో సప్త (7) స్వరములు ఇంద్రధనుస్సులో 7 రంగులు కలవు. జ్ఞానభూమికలు 7 గ పేర్కొనబడినవి. సృష్టిక్రమములో మానవుని యందు మూలాధార స్వాధిష్టాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రార చక్రములని 7 చక్రములు చెప్పబడినవి. 'Harmony' అను ఈ ధ్యానకేంద్రము పేరులో కూడా 7 ఆంగ్లభాషాక్షరములు గలవు ఈ 'హార్మనీ' లోపల నేలపై సాధకులు కూర్చుండు స్థలము

7 గుండ్రని (Concentrated Circles) వృత్తములుగా తయారుచేయబడి మధ్యలో బిందుస్థానము ఏర్పఱచబడి నది. 7 అడుగులు × 7=49' వ్యాసములపై ఈ భవంతి నిర్మింపబడినది 7 అడుగులు × 7' = 49' ఎత్తు పైన - శిఖరముపై బోర్లించిన మరొక చిన్న శంఖు వంటి కప్పు 7' నిడివి కలది. ఈ భవంతిలోకి సాధకులు ప్రవేశించునపుడు 7 మెట్లు ఎక్కి లోనికి వెళ్ళవలయును. ఈ భవంతి చుట్టు కమలమువలె నీలిరంగు నీటి కొలను ఏర్పఱచబడి అందు 7 పద్మములు నిర్మింపబడినవి. సూర్యభగవానుని, ఖగోళశక్తి 7 చేత సూచించబడుటచే, ప్రాణశక్తి ఈ ధ్యానకేంద్రములో 7 ద్వారా ఉత్తేజము చేయబడుచున్నది.

నిర్మల, నిశ్చల వాతావరణములో చల్లని నీలిరంగు సముద్ర తీరంలో 10 ఎకరాల విస్తీర్ణపు కొబ్బరితోటలో ఈసిద్ధాశ్రమము నిర్మింపబడుట భారతీయుల అదృష్టము ఈ స్థల ప్రభావమును మరికొంత తెలిసికొందాము. శ్రీ బి. ప్రభాత్‌కుమార్, విశాఖపట్నం వారు తమ స్థలమైన ఈ 10 ఎకరాల భూమిని శ్రీ సత్యసాయి అంతర్జాతీయ విద్యా కేంద్రమును నెలకొల్పాలనే ఉద్దేశ్యంతో కేటాయించి అట్టి సంస్థ నిర్మాణానికై 7 సంవత్సరముల నుంచి తపస్సుచేసారు ఈ స్థలమును 7 గురు గొప్ప వ్యక్తులు విభిన్న దినములందు దర్శించి, అచట కొంత సేపు ధ్యానముచేసి, ఈ స్థలమందు కొన్ని వేల సంవత్సరములనుండి భూమిలో కాలనాగులుగా కొందరు సిద్ధులు తపస్సాచరించుచున్నారని, వారి తపోమహిమవలన, అచట ధ్యానకేంద్రము నెలకొల్పిన ధ్యానము చేసిన వారి కోర్కెలు, ఆధ్యాత్మికోన్నతి సిద్ధించునని జ్యోతిషము పల్కుట ద్వారా ఈ Healing Center ను నిర్మాణము చేయుట అను సంకల్పమును శ్రీ ప్రభాత్ కుమార్‌గారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారికి సమర్పించగా, ది 1-7-93 న స్వామి ఆశీర్వదించిరి

ది 2-4-93 న శ్రీ కె. పార్వతీకుమార్‌గారు ఈ కేంద్రమునకు శంకుస్థాపన చేసిరి. ఇప్పటికే ఐరోపా, ఆసియా ఖండాలకు చెందిన అనేక అంతర్జాతీయ దేశాలనుంచి ఎందరో విదేశీ సాధకులు వచ్చి ఈ స్థలమందు ధ్యానకేంద్రము నిర్మించుటకు, వారి వారి ప్రోద్బలమును, ప్రోత్సాహములను కనబరచిరి. అర్జెంటైనా దేశములోని ('IGUAZU') 'ఇగుయాజు' జలపాతము వద్ద కల నీలిరంగు క్రిస్టలును 7 గురు సాధకులు వెళ్ళి, ఎంపిక చేసి, 17 Kg బరువుగల సుమారు 2 లక్షల రూపాయల వ్యయముతో ఆ క్రిస్టలను తీసుకొని వచ్చి ఈ భవంతిలో అమర్చిరి దీనిపై పడు సూర్యకిరణములు 'Ultra violet rays' ఆరోగ్యప్రదమైన కాంతి కిరణములను ప్రతిఫలింపజేయుట ద్వారా, ఇందు శారీరక రోగములు పోగొట్టుశక్తి కల్పింపబడుచున్నది. ఈ ఆశ్రమ ప్రాంగణములో ప్రకృతి ననుసరించి, ప్రస్తుతము గల కొబ్బరితోటలో, ఇద్దరు మహర్షులు 'ఔదంబర' వృక్షములు నాటి శ్రీ దత్తాత్రేయస్వామివారి సన్నిధిని కల్పించిరి వృక్ష శాస్త్రములో ముఖ్యమైనచెట్లను నాటుట ఖనిజ శాస్త్రములో గోవులను, గోవత్సములను ఈ ఆశ్రమమందు నివసింప చేయుట ఖనిజ శాస్త్రములో నీలిరంగు క్రిస్టలు నమర్చుట వేదశాస్త్రము ప్రకారము వేదాధ్యయన పాఠశాల ఇందు అమర్చుట మొ॥ అన్ని విధములైన మనోహ్లాదకరమైన శాంతిధామకములు ఇచట ఏర్పాటు చేయబడినవి. 'ఓంకారము' ఈ భవంతిలో నిత్యము ప్రతిధ్వనింప చేయుట ద్వారా 8 th plare నుంచి దేవతలు సూక్ష్మ రూపములో ప్రవేశింపబడుచున్నారనుట సత్యము

ఈ ఆధ్యాత్మిక కేంద్రము రూపుదిద్దుకొను సమయమందు ఏడుగురు మహర్షుల సలహా సంప్రదింపులు, ఆశీర్వాదముతో ఈ కేంద్రము ముందంజవేయుట గమనార్హము. 1) శ్రీ కె పార్వతీకుమార్ 2) శ్రీ సద్గురు శివానందమూర్తి 3) శ్రీ వేమకోటి క్రిష్ణయాజి సూర్య పీఠాధిపతి 4) శ్రీ సాయిదాసబాబా 5) శ్రీ భక్తరాజ మహరాజ్ 6) అర్జెంటీనా నుంచి నీలిరంగు రాయిని తెచ్చిన పాశ్చాత్యుడు. 7) హిందూ పేపరు మేనేజరు

శ్రీ వెంకటేశన్ అను వారల ప్రయత్నముపై భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి దైవానుగ్రహము 8th Plane నుంచి, ఈ ఏడుగురు ద్వారా దిగివచ్చినదనుట అతిశయోక్తికాదు.

ఈ ఆశ్రమములో జ్ఞానసిద్ధి కల్గుటకు సాధకులు దర్శించుకొనుటకు వీలుగా జీడిమామిడి చెట్ల తోపులందు 'శ్రీ మైత్రేయి' విగ్రహప్రతిష్ఠ చేసి చక్కని 'Study Circle' ను ఏర్పాటుచేసిరి. Masters and World Teachers లో సుప్రసిద్ధుల ఫొటోలనమర్చి మరొక 'క్లాసు' ఆధ్యాత్మిక విషయములు చర్చించుకొనుటకు వేరొక Study Circle ని ఏర్పాటుచేసిరి. ఇచ్చటి వాతావరణము ఎంతటి మనోహ్లాదమును కల్గించుచూ, సాధకులు క్షణములో ఆధ్యాత్మిక తన్మయత్వమును పొందించునట్లున్నదో సాధకులు దర్శించియే తీరవలెను అందరికీ ప్రవేశము ఉచితమే. ఇది ది 10-1-95 న ప్రారంభము కావింపబడినది.

ఉ॥ నింగిని నీలమేఘముల నీడల
దాగు శశాంఖుడోయనన్
చుంగున శిల్పభంగిమలు చుట్టిన
సుందరి వోలె నీలకం
ఠాంగన మించు సోయగము
నంబర వీధిచె లంగి, గోపుర
ప్రాంగణ వృక్ష సంతతుల
భాసిలు "హార్మొనియం" గాంచరే ॥

ఇట్టి ఆధ్యాత్మిక, ఆరోగ్యప్రదాయక, అపురూప, అద్భుత హార్మోనియమును నిర్మించి సాయి సేవలో భాగముగా త్యాగమును ఆచరించి చూపిన శ్రీ వి. ప్రభాత్ కుమార్ విశాఖపట్టణం వారికి :

మ॥ సకలాధీశ్వరుడై ప్రశాంతివిభుడై,
సర్వజ్ఞుడై నిత్యుడై
మకలంకాత్మకుడై, మహామహిముడై
ఆధ్యాత్మతత్వార్థ బో
ధకుడై, చిత్రవిచిత్ర శక్తిధరుడై,
ధర్మజ్ఞుడై, ధాత్రిర
క్షకుడై వెల్గెడి సాయి నిత్యమిడు
మోక్షజ్ఞాన సంపత్తినిన్ ॥

(మూడవ పేజీ తరువాయి)

సంకెళ్ళతో పనులు చేసుకోవటం కష్టం" అన్నారుట. ఆ బక్సర్ జైలులో రాహుల్ 'ఖురాన్' గ్రంథమును సంస్కృతం లోనికి అనువదించటం ప్రారంభించారు ఖైదీలకు ఉపనిషత్తులు వేదాంతం బోధించారుట.

"బౌద్ధ తర్కం" అనే గ్రంథమును రచించిన ప్రఖ్యాత రష్యన్ విద్వాంసుడు ప్రొఫెసర్ షేర్ బాట్స్కీ లెనిన్ గ్రాడ్ విశ్వవిద్యాలయంలోని తన జ్ఞాపకాల్లో, తన తరువాత బౌద్ధ తర్కమును బోధించగల వ్యక్తి ప్రపంచంలో కెల్లా "రాహుల్" ఒక్కరేనని వ్రాశారుట. తరువాత "రాహుల్"ని ఆ విశ్వవిద్యాలయంవారు ఆహ్వానించి ఉపన్యాసాలు చెప్పించారు. అవసానదశలో ఆయన శ్రీలంక విద్యాలంకార విశ్వవిద్యాలయంలో అధ్యాపక వృత్తి నిర్వర్తించారు. హిందీ సాహిత్య సమ్మేళన్‌వారు 'సాహిత్య వాచస్పతి' బిరుదునిచ్చారు. 34 సంవత్సరాలలో ఆయన 50 వేల పేజీలు ప్రచురణ చేశారుట. ఇంకా 12 గ్రంథములు అముద్రితంగానే మిగిలిపోయినాయిట. రోజుకు 18 గంటలు పనిచేసేవారుట. అధిక శ్రమ, వ్యక్తిగతమైన మనోవేదనలు ఆయన్ని రోగగ్రస్తుణ్ణి చేశాయి. ఆయన తన జీవితంలోని చివరి రెండు సంవత్సరాలలో జ్ఞాపకశక్తిని పూర్తిగా కోల్పోయారు. అంతటి మేధావి, మహా పండితుడు తన అవసాన

కాలంలో తన పేరును తానే చెప్పలేని స్థితిలోనికి పోవటం అతి విషాదకరమైన విషయం. 1937, 44, 62 లలో వీరు రష్యా సందర్శించారు. అయితే ఆయన ఆఖరి రష్యా ప్రయాణం జ్ఞాపకశక్తి కోల్పోయిన తరువాత చికిత్సకోసం జరిగింది. కాని ఆయన స్వస్థత చేకూరకమునుపే తిరిగి స్వదేశానికివచ్చారు 1963 సం॥ మార్చి 14 వ తేదీన డార్జిలింగ్‌లో ఆయన కన్ను మూశారు

రాహుల్ చేసిన కల్పనా సాహిత్య సృష్టిలో "వోల్గాసే గంగా' అత్యుత్తమ రచన. ప్రగతిశీల రచనలలో యీ రచన ఒక మైలురాయిగా హిందీభాషలో అనేక సంవత్సరాలుగా ప్రశంసించబడింది. అవసాన కాలంలో ఆయనకు 'పద్మభూషణ' బిరుదు లభించింది అయితే ఆ సమయంలో ఆయన ఆ గౌరవాన్ని ఆనందించ గల స్థితిలో మాత్రం లేరు. అప్పటికే ఆయన జ్ఞాపక శక్తి క్షీణించ నారంభించింది. జీవితాంతం సాహిత్య సేవకు అంకితమై అనువులు బాసిన సాహిత్యవేత్తలకు పట్టే అదృష్టం ఇంతేనేమో !

)-○-(

( 8 వ పేజీ తరువాయి )

వంటిది మనయొక్క జీవితములో ప్రధానమైన శక్తి. ఈ కాంతిశక్తి ద్వారానే ఈ విద్యుత్‌శక్తి లభ్యమౌతున్నది. ఈ విద్యుత్‌శక్తి అనేది అయస్కాంతముతో అభివృద్ధి అవుతున్నది. అయస్కాంతము, విద్యుత్ శక్తి రెండూ చేరినప్పుడే దివ్యకాంతి మనలో ఆవిర్భవిస్తున్నది. కనుక ఈ దివ్యకాంతి అనేటటువంటిది ఎక్కడినుంచో మనం కొనితెచ్చేటటువంటిది కాదు. మనయందే ఉంటున్నది. మన స్వరూపమే దివ్య స్వరూపము అందువలనే నేను దివ్యాత్మ స్వరూపులారా! అని అడ్రస్ చేస్తాను ఈ సత్యాన్ని మనం గుర్తించుకోలేకపోవడం చేతనే దేవుడెక్కడో ఉంటున్నాడని దేవులాడుతూ పోతున్నాము. దేవుడు సర్వత్రా ఉంటున్నాడు. సర్వత్రా ఉన్నదానిని గుర్తించుకోలేక పోతున్నారు ఈ సత్యాన్ని క్రమక్రమేణా మీరు గుర్తించడానికి ప్రయత్నించాలి.

సత్యాన్వేషణ అంటారు. ఏమిటి అన్వేషణ ? అయితే సత్యము సర్వత్రా ఉంటున్నదే. దీనికి ఒక ఉదాహరణము : మన కన్నులు అమ్మను చూస్తుందాలి అదే కన్నులు బిడ్డను చూస్తుంది. అదే కన్నులు భార్యను చూస్తుంది. అదే కన్నులు వంటమనిషిని చూస్తుంది. అయితే తల్లిని చూచే సమయంలో ఏ మనసుతో చూడాలి ? బిడ్డను చూచే సమయంలో ఏ భావముతో చూడాలి ? భార్యను చూచే సమయంలో ఏ తలంపుతో చూడాలి ? వంటమనిషిని చూచే సమయంలో ఏ చింతతో చూడాలి ? – ఇదియే సత్యాన్వేషణ. వీరు నలుగురు ఆడవారే. చూచేది కన్నులు ఒకటే కాని ఎవరిని ఏ దృష్టితో ఏ భావంతో చూడాలన్నదే సత్యాన్వేషణ అదే విధముగనే నాలుక ఉన్నది అసత్యమాడేది, సత్యమాడేది ఒక నాలుకే పరులను దూషణ చూసేది, భూషణచేసేది ఒక నాలుకే అయితేఒకేనాలుక అయినప్పుడు ఎవరిని దూషించాలి ? ఎవరిని భూషించాలి? ఎవరిని ప్రేమించాలి ? ఎవరిని ఆరాధించాలి ? అనేటటువంటిదే సత్యాన్వేషణ. 'సత్యాన్వేషణ' అనగా అన్నింటియందూ ఉన్నది సత్యము. పదార్థానికి తగిన ప్రయోగమే సత్యము.

వెన్న ఉన్నది, వ్రేలితో కొట్టవచ్చు. ఇనుము ఉన్నది సుత్తితోనే కొట్టాలి పదార్థానికి తగిన ప్రయోగమే సత్యాన్వేషణ ఇనుమును వ్రేలితో కొడితే వ్రేలు కూడా తెగిపోతుంది. వెన్నను సుత్తితో కొడితే ఛిన్నాభిన్నమైపోతుంది. దేనికి ఏ విధమైన దానిని ఉపయోగించాలి అన్నదే సత్యాన్వేషణ కనుక సర్వత్రా ఉండిన దైవత్వాన్ని అన్వేషణ చేయడమంటే మనలో భావమార్పు రావాలి. దైవభావము మనలో ఆవిర్భవింప

చేసుకొన్నప్పుడే సర్వాల యందు కూడనూ ఏకాత్మ భావాన్ని మనం దర్శించవచ్చు. ఈనాడు విగ్రహారాధన అనేది కేవలం ఒక మూర్ఖత్వం కాదు. అది సదాచారమే. కారణం ఏమిటి ? ఈ విగ్రహాన్ని ఆధారం చేసుకొనే చైతన్యాన్ని మనం పొందగలుగుతున్నాము.

మన ఇంటిలోపల గోడల పైన మన తాతలు, ముత్తాతల ఫొటోలు పెడుతుంటాము కాని వారిని మనం చూడలేదు. వాటికి మాలలు వేసి గౌరవిస్తుంటాము కాని వాటిలో ప్రాణముందా ? ప్రేమ ఉంటున్నదా ? లేదు.... లేదు... మన తాత, మన ముత్తాత అన్న అభిమానమే ఆ ఫొటోలను ఆరాధించడానికి కారణం. అభిమానమే లేకపోతే వాటిని మన ఇంటిలో ఎందుకు పెట్టుకుంటాము ? అదే విధముగనే ప్రతిదాని పైన కూడనూ ఒక అభిమానమే అణుశక్తి యొక్క ఒక విధమైన అభిమానమే అనురాగమే మనయొక్క నిజమైన భక్తి. అణుశక్తి యొక్క విశ్వాసమే మనయొక్క భక్తి. ఆ అణువే దైవము. కనుకనే దైవము ఎక్కడ ఉన్నాడంటే ఎక్కడెక్కడో లేదు అన్నింటి యందూ ఉంటున్నాడు. అయితే తెలుసుకోవడం చాలా కష్టం నిజముగా ఆ విశ్వాసమే మనకు అభివృద్ధి అయినప్పుడు తెలుసుకోవడం చాలా సులభం. ఈ యొక్క అర్థం చేసుకోక పూర్వమే దీనిపైన అనేక రకములైన అపోహలు, అనుమానాలు, వాదోపవాదములు జరుగుతుంటాయి.

పూర్వము కూడనూ చార్వాకులు ఈ విగ్రహారాధనను దూషించేవారు. కట్టకడపటికి వారు కూడనూ దీనిని గుర్తించుతూ వచ్చారు. అణువునందు కూడనూ ఆకారము ఉంటుంది కనుక, ప్రపంచమంతయు కూడనూ ఆకారమయమే. ప్రతి ఆకారము కూడనూ ఒక విగ్రహమే. నీటికి ఆకారమేముంటుంది? ఈ టంబ్లర్‌లో నీరు ఉంది ఈ టంబ్లర్ యొక్క కంటైనర్ బట్టి దీని ఆకారముంటుంది. కనుక ఆ నీరు పోసే పాత్రను బట్టి దాని ఆకారాన్ని మనం చెప్పవచ్చు. గాలికి ఏమి ఆకారము ? బెలూన్‌లో ఊదితే బెలూన్ ఆకారము వస్తుంది ఫుట్‌బాల్‌లో ఈ గాలిని ఊదితే ఫుట్‌బాల్ ఆకారము వస్తుంది. కాబట్టి అక్కడ ఆ గాలికి ఆకారము వచ్చింది కదా ! అదే రీతిగా ఈ దేహము అనే దాని లోపల ఆ దివ్యశక్తిని మనం నింపుకున్నప్పుడు ఈ దేహమూ ఒక ఆకారమే, కనుక నింపుకునే భావమును బట్టి మన ఆకారము తయారవుతుంది కనుక దైవము కానట్టిది ఈ జగత్తులో మరొకటి లేదు. "ఇందుగలడు అందు లేడను సందేహమువలదు" ఈ సత్యముతో నీవు ఆరాధన సలుపు సర్వత్రా నీకు దైవమే సాక్షాత్కరిస్తాడు. దైవమనేటటువంటిది అణువులో ఘనములో సర్వత్రా ఉంటున్నాది, అందువల్లనే గోపికలు చెప్పారు

" నిను కనుగొనగలమా కృష్ణా !
నిను కనుగొనగలనూ కృష్ణా !
అణువుకంటే అతి సూక్ష్మ రూపుడవు
ఘనముకంటే నతి గణనీయుడవు
ఎనుబది నాలుగు లక్షల జీవముల
అనయంబున నెడబాయకుండునట
అణువు రేణువు తృణ కాష్ఠము మొదలుగ
అఖండ రూపుడవై వెలయుదువట "

నీవు దొంగలలో దొంగవు. నీవు మంచివారిలో మంచివాడవు సర్వము నీవే భగవద్గీతలో విభూది యోగము చదివినవారికి భగవంతుని ఆకారమేమిటో చక్కగా అక్కడే నిర్ణయమవుతుంది. అన్ని రూపములూ తానే. అట్లనుకున్నప్పుడు మలమూత్రాలు కూడా భగవంతుడేనా అని ప్రశ్నించవచ్చు తప్పక. అవి కూడా భగవత్ స్వరూపాలే ఆ విశ్వాసమే నీకుంటే సర్వత్రా ఏకాత్మ భావము నీకుంటే, అక్కడ కూడా భగవంతుడు సాక్షాత్కరిస్తాడు కాని నీలో మలమూత్రము అన్న భావన రావటం చేత అక్కడ నీకు కన్పించడు. ఆ భావము ( భేదము ) రాకూడదు.

సర్వమూ భగవత్ మయముగానే భావించు. ఆ స్థితి వచ్చేది చాలా ఉన్నతి స్థాయి. అంతవరకు మాత్రము మనలో ఒక విధమైన పవిత్రమైన ఆకారాన్ని ఆరాధన చేస్తూ రావాలి. ఒక పటము. అందులో ఏమిటి ఉండాలి? డబ్బు ఒక నూరు రూపాయల నోటు. అందులో ఏమిటి ఉండాలి ? ఏదో వెదురుగుజ్జు, గడ్డిగుజ్జు వీటితో చేసినదే ఆ నూరు రూపాయల నోటు. దీనికి ఏమైనా ఒక శక్తి ఉన్నదా ? ఇది గవర్నమెంట్ మోహర్ ఉండడం వలననే దానికి అక్కడ విలువ ఇస్తున్నాం. ఆకారము లేని గుండును ఆరాధించము. శిల్పి దానిని తెచ్చి చెక్కి దానికొక ఆకారం యిచ్చిన తరువాత దానిని ఆరాధన చేస్తున్నాము. ఒక చిన్న ఉదాహరణము: ఒక కొండలో ఒక పెద్ద గుండు ఉంటున్నది. అది చూచినప్పుడు మనకు ఏమాత్రం ఆరాధన చేయాలనిపించదు. ఒక శిల్పి వెళ్ళి దానిని చక్కగా కృష్ణునిమాదిరి ఒకబొమ్మను తీర్చిదిద్దుతాడు. అది విగ్రహంగా రూపొందుతుంది ఆ విగ్రహాన్ని తీసికెళ్ళి దేవాలయములో ప్రతిష్ఠచేస్తాము. కాని ఆ గుండులోనున్న కొన్ని రాతి ముక్కలు ఆ కొండలోనే పడిపోతాయి. అప్పుడు ఆ ముక్కలు చెబుతాయట ఆ గుడిలో ఉండినటువంటి వారము మేమే అంటాయట ఏమని చెబుతాయి? 'తత్, త్వం, అసి' మా గుండులోనున్న ముక్కలు మేము ఇక్కడ కొన్ని ఉంచాము,ఒక ముక్క అక్కడకుపోయి ప్రతిష్ఠఅయింది. ఆ ముక్కకు ఆకారము వచ్చింది, మాకు ఆకారములేదు అంతే భేదము. కనుక ఆకారమునకు మాత్రమే ఆరాధన వస్తున్నది కాని, ఆకారములేనిది కూడనూ దైవత్వమే. కనుకనే 'నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం నిత్య, శుద్ధ, బుద్ధ ముక్త నిర్మల స్వరూపిణం' నిర్గుణం నిరంజనం. ఈ ఆకారము గుణము, నిర్గుణం కూడనూ దైవత్వమే. ఇలాంటి విశాలమైన భావాల్ని మనం పెంచుకోవాలి. ఈ సంకుచితమైన భావాలు మనలో పెంచుకోవటం చేతనే దినదినమునకునూ మన సాధన దిగజారిపోతున్నది. మనం అభివృద్ధిగావించుకోవాలనుకుంటే " సర్వమూ దైవత్వమే దైవము కానటువంటిది లోకములో మరొకటిలేదు '' అనే ఈ విశాలత్వాన్ని మనం పెంచుకోవాలి. అన్నింటికినీ మన భావమే కారణము దేవుడు ఉన్నాడంటే ఉన్నాడు లేడంటే లేడు ఇవి రెండు కూడనూ భావములో మార్పేగాని మరొకటికాదు. కనుక దైవత్వాన్ని మనం విశ్వసించినప్పుడే సర్వమునూ మనం విశ్వసించిన వారమౌతాము. కనుక విశ్వాసమే మనయొక్క ఆరాధన. పెండ్లి కాకముందు వరుడెవరో, వధువెవరో అయిన తరువాతనే ఆ వధూవరుల యొక్క సంబంధము చేరిపోతుంది. మనకు విశ్వాసము లేనంతవరకునూ దేవుడెవరో, జీవుడెవరో తెలియదు ఈ విశ్వాసముతో ఆరాధన సల్పిన తరువాత జీవుడే దేవుడు, దేవుడే జీవుడు సంబంధం ఏర్పడనంతవరకే ఈ భేదములు సంబంధము ఏర్పడిన తరువాత అభేదమే. కనుక ఇట్టి అభేదత్వాన్ని పెంచుకోవటానికి తగిన ప్రయత్నం చేయాలి. ప్రపంచంలో సర్వస్వమూ దైవత్వమే. అణువులేనిది మరొకటి లేదని సైంటిస్టులు చెబుతుంటారు. దీనినే రెండింటి యొక్క ఏకత్వాన్ని చేసేటటువంటిది. దీనిని సైంటిస్టులు 'మాగ్నటిక్ థెరపి' అంటున్నారు. వేదాంతులు 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అన్నారు. కనుక ఈ పదముల్లో భేదము వస్తుందికాని, మాగ్నట్ తో చేరినప్పుడు ఇనుము. కూడా మాగ్నట్ అయిపోతుంది ఈ రెండూ ఒక్కటే. ఈ శక్తి సర్వమునకూ ఉంటుండాలి దానిలో ఉన్నటువంటిది. అంతా కూడనూ అణుశక్తే ఈ అణువుల చేరికే ఈ పదార్థముల చేరిక. కనుక దైవత్వాన్ని మనం ఏదో ఆకారము కానటువంటిది, నిరాకరమైనదని మనం భావించకూడదు. ఆకారము లేని దానిని నువ్వు ఏ విధంగా ఆరాధన చేయగలవు ? ఏ రీతిగా చింతించగలవు ? దీనిని చూపేంతవరకు మాత్రము నిజమైన ఆకారము అవసరము ఫలానాది ఇది, అని చూపేంతవరకు వ్రేలు కావాలి. చూచిన తరువాత వ్రేలుతో అవసరంలేదు. ఆదే విధముగా నిజమైన శక్తిని

చూసేంతవరకు మనం విగ్రహారాధన చేసేతీరాలి దివ్యత్వాన్ని గుర్తించిన తరువాత విగ్రహం అక్కర లేదు. ఇలాంటి ఏకత్వంలో మనం సరి అయిన దివ్యత్వాన్ని విచారిస్తూపోవాలి

ఈనాడు శివరాత్రి. శివరాత్రి అనగా ఏమిటి? మంగళకరమైన రాత్రి అని పేరు. ఏమిటి ఈ మంగళం? ఎన్నో రాత్రులు మనం అనుభవిస్తూ వచ్చాము కదా! అయితే అన్ని రాత్రులు చీకటి రాత్రులుగా వచ్చాయి, ఈనాడు మాత్రము శివరాత్రిగా వచ్చింది అనగా మంగళకరమైనరాత్రి దేహమునందు, అణుశక్తియందు కొన్ని విధములైన శక్తులు ఉంటున్నాయి ఇదియే షడ్ శక్తులు 1. ఐశ్వర్యము, 2. ధర్మము, 3. కీర్తి, 4. సంపద, 5. జ్ఞానము, 6. వైరాగ్యము. షడైశ్వర్య స్వరూపుడు భగవంతుడు కాబట్టి ప్రతి శక్తియందునూ ప్రతి వ్యక్తియందూ షడైశ్వర్యములు ఉంటున్నాయి. కనుక మనం దైవం కాదని ఎట్లా చెప్పగలము? మనం కూడా దైవమే దేహభ్రాంతి ఉండినంతవరకు దైవాన్ని మర్చిపోతున్నాము దైవభ్రాంతి వస్తే దేహాన్ని మర్చిపోతావు. దేహమనే అభిమానము మనం పెంచుకున్నంతవరకునూ దైవాభిమానము రాదు. కొంతమంది రామకృష్ణ వద్దకు వచ్చారు. 'స్వామీ! మీరు దైవాన్ని చూచారా?' అన్నారు. 'ఆ చూచాను నీవు నన్ను నేను నిన్ను ఏరీతిగా చూచుకుంటున్నామో అట్లేచూచాను' అన్నాడు. 'ఏదీ మాకు కన్పించడం లేదే!' అన్నారు. 'నాయనా! నీవు ధనానికోసం ఏడుస్తున్నావు, బిడ్డలకోసం ఏడుస్తున్నావు, భార్యకోసం ఏడుస్తున్నావు, బంధువుల కోసం ఏడుస్తున్నావు దైవంకోసం నీవు ఏడుస్తున్నావా? దైవంకోసం ఏడ్వు, తప్పక దైవం కన్పిస్తాడు. మామూలుగా ఏడ్చి ప్రయోజనంలేదు. హృదయము నుంచి రావాలి ఆ ఆవేదన. తప్పక నీకు దైవం కన్పిస్తాడు' అన్నాడు రామకృష్ణ. దైవం సర్వత్రా ఉండినప్పటికినీ మనకు అర్థంకాదు. కన్నులు లేని వానికి ఎంత పెద్ద బల్బు తెచ్చి పెట్టినప్పటికీ వాడికి తెలియదు కనుక ఈ విశ్వాసము లేనివారు గాఢమైన భక్తి లేనివారు ఏ విధంగా అర్థం చేసుకోగలరు? ఈనాడు దైవదృష్టి లేనటువంటి అజ్ఞానులుగా ఉండటం చేతనే దైవత్వాన్ని అర్థం చేసుకోలేకపోతున్నారు. కాని తన తత్త్వాన్ని తాను గుర్తించుకుంటే దైవత్వం చక్కగా అర్థమవుతుంది. కనుక ప్రతి అణువు కూడనూ భగవత్ స్వరూపమే. ప్రతి పదార్థము కూడనూ భగవత్ స్వరూపమే. ప్రతి వ్యక్తి భగవత్ స్వరూపమే ఈ సత్యాన్ని మనం తీసుకుంటే అహింస అక్కడే ప్రారంభమౌతుంది. ఇదే సత్యస్వరూపకంగా సాక్షాత్కరిస్తుంది కనుక దైవనామము, దైవరూపముల రెండే మన నేత్రములు ఒక నేత్రము దైవరూపము, ఒక నేత్రము దైవ చింతన. కనుకనే ఈ రెండింటియొక్క ఏకత్వము చేతనే ఆనందమనేది మనలో ఆవిర్భవిస్తుంది. ఈ దృష్టిని మనం లోకదృష్టిగా తీసుకోకూడదు చూస్తున్నాం మనం కాని లోకదృష్టితో మనం చూస్తున్నాం దైవ దృష్టితో చూడు! దృష్టిని మార్పు చేసుకో! సృష్టిని మార్పు చేయడం వీలు కాదు. ఈనాడు సృష్టిని మార్పు చేయడానికి ప్రయత్నిస్తున్నారు అందువల్లనే లేని Reactions అంతా వస్తున్నాయి చాలా ప్రమాదాలు సంభవిస్తున్నాయి. చాలా అపవాదు లొస్తున్నాయి చాలా అపకీర్తులు పొందుతున్నాము కాదు! కాదు! ఈ ప్రకృతిని మనం దైవదృష్టితో చూడాలి. ఏది చూచినా దైవదృష్టితో చూడాలి దీన్ని మనం అభ్యాసం చేయాలి.

పుట్టినబిడ్డ తక్షణం పరిగెత్తమంటే పరిగెత్తదు. కొంచెం ప్రాకాలి తరువాత కూర్చోవాలి, తరువాత లేచి కొంచెం పడాలి, గోడలు పట్టుకొని నడవాలి. తరువాత క్రమక్రమేణ తాను పరిగెత్తడానికి ప్రయత్నం చేస్తుంది.

కనుక మొట్టమొదట నీవు అభ్యాసాన్ని ప్రారంభించు. ఈ భూమికి ఆకర్షణశక్తి ఉన్నది ఆ ఆకర్షణశక్తే దైవత్వము అదియే నిజమైనటువంటిది. న్యూటన్ కనుగొనక పూర్వము కూడనూ భూమికి ఆకర్షణశక్తి ఉన్నది, కాని ఆయన పరిశీలన చేశాడు, పరిశోధన చేశాడు దానిని గుర్తించాడు ఈనాడు పరిశీలన చేయడంలేదు, పరిశోధనలు సల్పటంలేదు. వాదోపవాదాలు మాత్రం చేస్తున్నాము. జీవితమే వ్యర్థమవుతున్నది. కనుక ఏది చేసినప్పటికినీ సర్వత్రా దైవముంటున్నాడని, దైవమును మరుగుచేయుటకు వీలుకాదని తెలుసుకోండి స్వామి చూడటం లేదే! అని ఎక్కడో ఏదో చేస్తుంటారు కొందరు. దైవము

నకు రెండు నేత్రములు కాదు ఉంటున్నది. "సహస్ర శీర్షః పురుషః సహస్రాక్షః సహస్రపాత్" అనేక నేత్రాలుంటున్నాయి. కానీ నిన్ను నీవు మోసం చేసుకుంటున్నావు. అదియే దైవాన్ని మోసం చేయుటము నీమీద నీకు నమ్మకముంటే దైవాన్ని కూడనూ నమ్మటానికి వీలవుతుంది ఈ విశ్వాసాన్ని అభివృద్ధిగావించుకోవాలి. దైవమునకు చేతకానిది లోకంలో మరొకటి లేదు. దైవము ఏమైనా చేయవచ్చును. అట్టి ప్రేమ తత్త్వాన్ని ఆకర్షించుకొనే భావములు మనలో ఆవిర్భవించాలి. ఆ ఆకర్షించుకోవడానికి కొంత పవిత్రత కావాలి మాగ్నెట్ ఉంటుండాలి ఇనుపముక్క ఇక్కడ పెట్టాము. కాని ఆ మాగ్నెట్‌ను ఇనుపముక్క కరుచుకోవడంలేదు కారణం ఏమిటి? అంత మాత్రముచేత Magnet లో Power లేదనుకోకూడదు. Magnet లో Power ఉంటుంది, కాని ఈ ఇనుముమీద Rust Dust (తుప్పు, ధూళి) ఉన్నది. ఈ తుప్పు దూళిని తీసివేస్తే అయస్కాంతం దానిని ఆకర్షిస్తుంది. అదేరీతిగా దైవము సర్వత్రా ఉంటున్నాడు. నీ బుద్ధిలోనే ఉంటున్నాది, ఈ Dust, Rust అంతాను, దాన్ని శుభ్రం చేసేయి. ఈ దైవత్వము తప్పక ఆకర్షిస్తుంది. ఆ దోషము నీలో ఉందికాని దైవములోలేదు కనుక నీ భావములను మార్చుకోవాలి. భావములను ఏరీతిగా మార్చుకోవాలి? సర్వమూ దైవమే అనేటటువంటి భావంగా మార్చుకోవాలి

ఈనాడు మహాశివరాత్రి మంచి మంగళకరమయిన బుద్ధులు మనలో పెంచుకోవాలి. మంగళకరమయిన Actions అంతా మనలో రావాలి మనయొక్క ప్రవర్తన లోపల పవిత్రమైన ప్రవర్తన రావాలి. మన భావాలలో పవిత్రమైన భావాలు రావాలి నిరంతరము సంకుచితమైన భావాలతో నిండిపోకూడదు. ఈనాటి మానవునికి త్యాగం శూన్యమైపోయింది. ప్రతి మానవునికి మూడు ప్రధానం. 1) దేహాభిమానము 2) త్యాగము 3) దివ్యత్వమైన ఆధ్యాత్మిక దృక్పథము. ఈ మూడింటి యొక్క ఏకత్వమే మానవత్వము తెలుసుకోవటము– మనస్సు; చేయటము– దేహము; సాక్షిభూతముగా ఉండటము– ఆత్మ. కనుక శరీర మనస్సు, ఆత్మలయొక్క సమ్మిళితమే మానవత్వము ఈ మూడింటియందూ ఉన్నది దైవత్వము ఒక్కటే. అదే భిన్నత్వంలో ఏకత్వం. ఈ తత్త్వాన్ని మనం గుర్తించాలి. అణుతత్త్వాన్ని చక్కగా అర్థం చేసుకొంటే అంతా అర్థం అవుతుంది. ఇది దేనితో తయారైందో అర్థం చేసుకొంటే వాదోపవాదములు ఉండవు. ఇదంతా పత్తితో తయారైంది. ఈ పత్తే దారం అయింది. ఈ దారంతో నేస్తే బట్ట అయింది. కనుక బట్ట, దారం, పత్తి మూడు ఒక్కటే కనుకనే నా శరీరము, నా మనస్సు, నా ఆత్మ అన్నింటియందూ అణుతత్త్వము ఒక్కటే అనే సత్యాన్ని గుర్తించాలి కనుక 'అణోరణీయాన్, మహతోమహీయాన్' అన్నారు ఒక చిన్న మర్రి విత్తనం నాటితే పెద్దవృక్షంగా తయారైపోతున్నది. ఈ వృక్షమంతా ఎక్కడి ఉంది ఇంతకుముందు? ఆ చిన్న మర్రి విత్తనమందే ఉంటుండాలి. ఆ పెద్ద వృక్షములో చిన్న మర్రివిత్తనమే వస్తుంది. ఈ అణువునుంచి ఘనము అయింది. ఘనమునుండి తిరిగి అణువుగా మారింది కాబట్టి ఈ అణువు ఘనము రెండూ ఒక్కటే కనుక ఈ అణుతత్త్వాన్ని మొట్టమొదట తెలుసుకోండి ఇది హేతువాదమునకు కూడా అనుకూలమే అనేకమంది నాస్తికులు కూడనూ దేవుడెక్కడ? అని వాదిస్తుంటారు, ఇది అర్థములేని వాదన. దేవుడు కానిది ఈ లోకములో లేదు. దేవుడెక్కడ? అని అడిగేవాడు కూడా దేవుడే వాడు అడిగే స్వరూపము దేవుడే. దూషించేవాడూ దేవుడే, భూషించేవాడూ దేవుడే అందరూ దేవుళ్లే అంతా ఒక్కటే అనే సత్యమును గుర్తించినవాడు మహాతత్త్వము గుర్తించినవాడే కనుక ఈ బేధములంతా వ్యక్తులలో ఆవిర్భవించేనవే కాని ఆహారవిహారములలో పుట్టినవే కాని, దైవములో ఏనాడు ఈ బేధములేదు అందుకోసమే ఈ విశ్వమునంతా భగవంతుడు సృష్టించాడు చిత్రవిచిత్రముగా సృష్టించాడు. మానవునికి అవసరమైన సమస్త సామాగ్రినీ సృష్టించాడు, తినడానికి తిండి ఇచ్చాడు, త్రాగటానికి నీరు ఇచ్చాడు, ధరించడానికి వస్త్రం ఇచ్చాడు, నివసించడానికి ఇల్లు ఇచ్చాడు, అన్ని ఇచ్చాడు. ఏమీ తక్కువలేదు. అయితే నాయనా! ఇవన్నీ మీకోసమే ఇచ్చాను. మీరే తీసుకోండి అన్నాడు. నాకేమి అక్కరలేదు నేనేమీ దీంట్లో ప్రవేశించను, సర్వమూ మీరే అనుభవించండి అయితే ఒక Condi-

ion (షరతు) మాత్రము పెట్టాడు ఏమిటా Condition ? మీరు ఏమిచేస్తారో దాని ఫలితాన్ని మీరు అనుభవించాలి మంచిచేస్తేమంచి ఫలితమొస్తుంది. చెడ్డచేస్తెచెడ్డ ఫలితము వస్తుంది. ఈ ఫలితానికి మాత్రం నీవు సిద్ధంగా ఉండాలన్నాడు, అయితే ఈనాడు పుణ్యఫలం కావాలని కోరుకుంటున్నాడు, కాని పుణ్యం చేయడానికి ముందుకు రావడంలేదు. పాపఫలం వద్దు అంటున్నాడు కాని పాప కార్యం చేయడానికి ముందుకు వస్తున్నాడు. ఎవరి దోషము ? భగవంతుడు దీనికి సాక్షీభూతుడేగాని, దేనికీ తాను కర్త కాదు. సర్వమునూ సృష్టించి ప్రజలకు ఇచ్చాడు. ఆ ప్రజలుచేసే మంచి చెడ్డల ఫలితములే వాళ్ళు అనుభవిస్తున్నారు. దీనికి భగవంతుడు సాక్షీభూతుడేగాని మరొకటికాదు. ఇప్పటికయినా ఈసత్యాన్ని గుర్తించి మంచి కార్యాలు చేయడానికి పూనుకోండి !

ఈ విధమైన దానిని మనం నేర్చుకోవాలి. నీవు మంచి కావాలనుకుంటే మంచి చేయి. మంచిని చూడు మంచిని విను, మంచిని చెప్పు, మంచిగా జీవించు. ఇలాంటివి మనం నేర్చుకోవాలిప్పుడు ఎందుకంటే ఉన్నత స్థాయికి పోవాలంటే క్రమక్రమేణా ఈ చిన్న మార్గములలో ప్రవేశించి, తదుపరి ఉన్నతమైన Royal Roadలో మనం చేరిపోవాలి కర్మమార్గంలో ఇది ఒక ఉపాసన, మొట్టమొదట మనం ప్రయత్నం చేసేటప్పుడు ఒక మట్టి రోడ్డులో బస్సు బయలుదేరుతుంది. ఈ మట్టి రోడ్డులో పోయినప్పుడు కొంత దూరం పోయిన తరువాత కొంత మంది Passengers వచ్చారంటే బస్సు నిలుస్తుంది నిలిచినప్పుడు ఈ వెనుక వచ్చిన Dust అంతా Bus పైన పడిపోతుంది అదే కొద్ది దూరం పోయినతరువాత తారు రోడ్డులో పోతాము. తారురోడ్డు ఎక్కిన తరువాత మట్టంతా నిలిచిపోతుంది, మట్టి లేకుండా మనం సుఖంగా ప్రయాణం చేస్తాము. కనుక మనం తారు రోడ్డుకు పోయేంతవరకు మన కర్మలు నిలుపకూడదు మధ్యలో ఎక్కడయినా మన కర్మ అనే బస్సును నిలిపినామా ఈ Dust అంతా వచ్చిపడిపోతుంది కనుక మొట్టమొదట మనం కర్మ మార్గలో ప్రవేశించాలి తదుపరి జ్ఞాన మార్గంలో పోవాలి ఈ రెంటికీ మధ్యలో ఉపాసనా మార్గం ఉంటుండాలి, ఆ ఉపాసనా మార్గమునే ఈనాడు గుర్తించాలి ఏమిటి ఈ ఉపాసన ? 'అన్నింటి యందూ దైవత్వముంది' అనే విశ్వాసాన్ని పెంచుకోవాలి. God is every where : Every think is God ఈ సత్యాన్ని మనం గుర్తించాలి అప్పుడే మనం దోషాలను ఏమాత్రం చేయం. అప్పుడే మనం అసత్యాలను ఆడము అధర్మాలలో ప్రవేశించము, పరులను దూషించము, హింసించడం ఈ పవిత్రమైన గుణములను మనలో అభివృద్ధిగావించుకోవాలి. ఇదియే శివరాత్రి యొక్క ప్రధానమైనలక్ష్యము మంచి విషయాలు వినాలి.

నాల్గు సినిమాలు చూచి రాత్రింతా నేను జాగారం చేశానంటే - ఇది జాగారమవుతుందా ? జా - గరణ అనగా ఏమిటి ? దైవచింతనతో వచ్చింది జాగరణ అవుతుంది. జ - అనగా పుట్టటము , గరణ - అనగా దైవత్వముతో గూడిన భావముతో ఆనాడు జాగరణ చేయాలి. మన కర్మలన్నీ కూడనూ దైవముతో కూడి ఉండాలి. మనయొక్క భావములు దైవముతో చేరినవై ఉండాలి. అది నిజమైన జాగరణ పూర్వీకులు ప్రతి దాన్ని కూడనూ ఒక్కొక్క రీతిగా మనకు అందిస్తూవచ్చారు. ఆ అక్షరాలకు కూడనూ ఎన్నో అర్థాలుంటున్నాయి ఎవరికి తగిన అర్థాలు వారు తీసుకుంటుంటారు ఇది సరిఅయినది కాదు. దాని అర్థము దివ్యత్వార్థముగా మనం తీసుకోవాలి. అప్పుడే సరి అయిన అర్థం మనకు ప్రాప్తిస్తుంది. ఒక చిన్న ఉదాహరణము. పాండవులంతా కూర్చొని ఒక విచారణ చేస్తున్నారు రేపటి దినము యుద్ధము ప్రారంభము అవుతుంది. ఎవరెవరు ఏఏ బాధ్యతలు వహించాలి? ఎవరెవరు ఏఏ దిక్కుకు బయలుదేరాలి ఇది అందరు కూడనూ Plan వేసుకుంటున్నారు వీరు Plan వేసుకుంటున్నప్పుడు దుర్యోధనుడు వచ్చాడు. దేనివల్ల? అక్కడ గురువుగారయిన ద్రోణాచార్యుడు పాండవులకు తెలియని ఒక పదాన్ని దుర్యోధనునికి చెప్పి పంపించాడు ఈనాడు వీళ్ళు ఓడిపోతారు, వాళ్ళకు అవమానం అయిపోతుంది అనుకున్నాడు పరిగెత్తివచ్చాడు దుర్యోధనుడు ఈ ఐదుమంది ఉన్న చోటుకి వచ్చి ఖ జ జ నాతోడ పోరాడదగునే నీకు' అన్నాడు నీవు నాతో పోరాడ వీలవుతుందా ? అంటే పాండవులకు 'ఖ జ జ' అంటే ఎవరో తెలియదు. ఎవరో ఒకరు పొరపాటున అర్జునుడు గాని, లేక ధర్మజుడు గాని లేస్తే అవమానమైపోతుంది. ఈ పదానికి అర్థం తెలియని మూర్ఖులుగా ఉంటున్నారేమో

వని భావిస్తారేమో ! ఈ సత్యాన్ని గుర్తించిన కృష్ణుడు భీముని వైపు తిరిగి సంజ్ఞ చేశాడు 'Getup' అన్నాడు అప్పుడు భీముడు లేచాడు. దుర్యోధనునికి దీని అర్థము తెలియదు తిరిగి వెళ్ళిపోయాడు కట్టకడపటికి ఈ ఐదుమంది పాండవులు కృష్ణుని అడిగారు. 'స్వామీ ! ఏమిటిది ? ఎప్పుడూ కూడనూ మా తల్లి పెట్టిన పేరు కాదే ఇది ! ఎవరు పెట్టిన పేరు ? ఖ జ జ అంటే ఏమిటి దీని అర్థము' అని అడిగారు. అప్పుడు ఖ - ఆకాశము జ - దానితో పుట్టినది వాయువు జ - తిరిగి వాయువులో పుట్టినది వాయుపుత్రుడు. వాయుపుత్రుడు దేవుడు. కనుక ఖ జ జ అనగా భీముడు కనుక వాయుపుత్రుడు భీముడు అన్నాడు కృష్ణుడు. ఈవిధముగా సర్వమూ దైవమునకే తెలుస్తుంది కాని అందరికీ తెలిసేది కాదు ఈ విధంగా సర్వరక్షకుడైన కృష్ణుడు పాండవులను రక్షించుతూ వచ్చుచుండుటచేతనే పాండవులు దిగ్విజయాన్ని సాధిస్తూవచ్చారు. పాండవులు కూడనూ కృష్ణుని శరణుజొచ్చారు అదే విధంగానే దైవాన్ని మనం శరణుజొచ్చినప్పుడు ఏమాత్రమూ ఎందులో కూడనూ, అపజయమనేదే ఉండదు అన్నింటి యందునూ జయమునే పొందుతాం.

ఈనాడు శివరాత్రికి మరికొన్ని అర్థాలు కూడా ఉంటున్నాయి. ఇది ఆత్మలింగ దర్శనము అన్నారు. జ్యోతిర్లింగ దర్శనమన్నారు అగ్నిలింగ దర్శనము అన్నారు, వాయులింగ దర్శనము అన్నారు పంచలింగాలంతా ఉంటున్నాయి అయితే ఇదంతా ఈనాడు మనస్సుకు రాత్రికి సంబంధం ఉంటుండాలి రాత్రి చీకటిది మనస్సుకూడా చీకటిదే అయితే 'చంద్రమా మనసో జాతః' చంద్రునికి మనస్సుకు సంబంధం ఉంటుంది. ఈ చంద్రుని లోపలున్న (కళలు) శక్తులు 16 ఈ 16 శక్తులలో 15 శక్తులు లయమై ఉంటున్నాయి ఒక్కశక్తి మాత్రమే ఉంటుండాది. కనుక ఈ రాత్రి అంతా ఒకే శక్తి వుంది గాబట్టి మనం తప్పక దీనిని సాధించవచ్చును. కనుక దీనిని సాధించాలంటే దైవచింతన చేసి మనం జయించాలి. అందువలన రాత్రంతయుకూడనూ దైవచింతన చేస్తూవచ్చారు అయితే మనసులో ఉండిన 18 కళలు కూడనూ దైవములో లీనమైపోయినాయి అదియే జ్యోతిర్లింగదర్శనము. కనుక 'శివరాత్రి' అనగా మంగళకరమైన రాత్రి. దైవచింతనచేత ఈ రాత్రిని దిగ్విజయాన్ని సాధించాలి. ఈవిధంగా ప్రాచీన ఋషులంతా కూడనూ ఈ విధమైన కర్మలనాచరించి ఫలితాన్ని పొందుతూ వచ్చారు. ఈ దివ్యత్వమనేది అత్యంత సమీపంగా ఉంటుంది. అయస్కాంతశక్తినేది మనలో ఆవిర్భవిస్తూ వస్తుంది దేహములో ఉండే సర్వ కణములు శక్తివంతంగా ఉంటాయి. అన్ని వెంట్రుకలు కూడనూ ఆకర్షింపచేసే దివ్యశక్తి ఈ రాత్రి మనలో ఆవిర్భవిస్తుంది కనుక మనలో ఒకవిధమయిన శబ్ద ప్రమాణము అభివృద్ధి అవుతుంది, వాక్‌శక్తి వస్తుంది. అణుశక్తి అభివృద్ధి అవుతుంది, కాంతిశక్తి అభివృద్ధి అవుతుంది, అయస్కాంతశక్తి అభివృద్ధి అవుతుంది. అన్ని శక్తులు ఈనాడు అభివృద్ధి అవుతాయి. ఈ అభివృద్ధి కావడంచేతనే దివ్యతేజస్సుగా రూపొందుతుంది. అదే శివరాత్రి అన్నారు. కనుక ఈ దుర్భావములు, దురాలోచనలు, దుశ్చింతనలు ఈనాడు మనలో ప్రవేశించకుండా చూచుకోవాలి నమ్మకాన్ని పెంచుకోవాలి 'Strong Faith' అనే పునాదిని భద్రంగా వేసుకొన్నప్పుడే ఎన్ని బాధలు వచ్చినప్పటికి వాటిని ఎదుర్కొగలం

ప్రేమస్వరూపులారా! ప్రేమయే దైవము దైవమే ప్రేమ మన పలుకులు ప్రేమతో ఉంటుంది, మన చేష్టలు ప్రేమతో ఉంటుంది మన వ్రాతలు ప్రేమతో ఉంటుంది మన జీవితమే ప్రేమమయంగా మారినప్పుడు అంతా ప్రేమయే అవుతుంది. (ది 27-2-1985)

## గ్రంథాలయములకు మనవి

మన రాష్ట్రములోని కొన్ని జిల్లా గ్రంథాలయ సంస్థల ఆధ్వర్యమున నున్న గ్రంథాలయములకు గత కొన్ని సంవత్సరాలుగా 'శ్రీవాణి' మాసపత్రికను తెప్పించుచున్నారు వారందరికి కృతజ్ఞతలు. మరల నూతన సంవత్సరానికి కూడా యథాతథంగా శ్రీవాణి మాస పత్రికను పంపుతున్నాము. సహృదయంతో స్వీకరించి, రాష్ట్రస్థాయిలో మూడు సార్లు ఉత్తమ విశిష్ట అవార్డులనందుకొనిన 'శ్రీవాణి' ని ప్రోత్సహించ ప్రార్థన ఒకవేళ ఏ గ్రంథాలయమునకైనా లోటు బడ్జెట్ వుండి 'శ్రీవాణి' మాసపత్రికను తెప్పించుకోవటానికి అవకాశం లేని యెడల వెంటనే తెలియజేయ ప్రార్థన

ధన్యవాదములు

- సం.

# రామనామాక్షరద్వయము బీజాక్షర సమన్వయము

—— పంచాంగము శ్రీనివాసశాస్త్రి

శ్రీగుణాలంకృతము రామనామాక్షర ద్వయము. పండితులకుగాని, పామరులకుగాని అత్యంత సులభమైన విధానంతో ఆత్మానందం కలిగించే బీజాక్షరశక్తి రామనామాక్షరాలలో దాగియున్నది. రామనామం (ర + ఆ + మ) లోని 'ర' కారము అగ్నిబీజమై సాధకుని పాపములను కడిగివేయుచున్నది. 'ఆ' కారము సూర్యబీజమై, సర్వవేద ప్రకాశకమై, భక్తుని మేధో వికాసానికి దోహదమొనగుచున్నది. 'మ' కారము చంద్రబీజమై అమృతత్వము ప్రసాదిస్తున్నది. ఈ మూడు రకాల శక్తుల వలన హృదయాంధకారము నిర్మూలింపబడుచున్నది.

ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపములను హరించి భగవదానందమును కలుగజేయునదే 'రామ' మంత్రశక్తి రామనామోచ్చారణ మూలమున ఇడా, పింగళ, సుషుమ్నా నాడుల సంచాలన విధానము సౌలభ్యమై ఆధ్యాత్మికానంద ప్రాప్తికి దోహదమగుచున్నది. 'ర' కారము సుషుమ్న, 'ఆ'కారము పింగళ, 'మ'కారము ఇడ నాడులకు దివ్యసంకేతములు. రామశబ్దము మహావాక్యాలకు సన్నిహితమై విలసిల్లుచున్నది. రా–తత్ పదార్థమవియు (భగవంతుడు), మ– త్వం పదార్థము (జీవుడు). ఈ రెండూ కలిస్తే 'తత్వమసి' అనే మహావాక్యముగ అవగాహన కలుగుచున్నది.

సదా రామో 'హమస్మీతి తత్వతః
ప్రవదంతి యే
నతే సంసారిణో నూనం
రామయేవ న సంశయః "

ఈ శ్లోకానుసారము యెల్లప్పుడు నేనే రాముడనని తాత్వికముగా భావించి యే సాధకుడు అనుభూతిని పొందగలడో, అట్టివాడు నిస్సంశయముగా రాముడే అవుతాడు కాబట్టి, రామనామ దివ్యసాధంలో "అహం బ్రహ్మాస్మి" అనే మహావాక్యము చైతన్యశోభతో వెలుగొందుచున్నట్లు తెలుసుకోగలము

"రమంయసీతి రామః" యే పదార్థ చింతన వలన సాధకుడు ఆత్మానందమనుభవించి, లోకాతీతమైన, శోకాతీతమైన దివ్యానందపదమందు, తురీయస్థితి చేరగలడో, ఆ అఖండ చైతన్యస్థితిని, రామనామము ప్రసాదించుచున్నది అందువలన "ప్రజ్ఞానం బ్రహ్మ" అనే మహావాక్యముకూడ యీ నామమందే యిమిడియున్నట్లు గమనించవచ్చును

'రామ' శబ్దము ఆరు వస్తువులచేత ఆవరింపబడియున్నది. 1. బ్రహ్మ 2 జీవుడు 3 మహానాదము 4 స్వరము 5 బిందువు 6 మాయ. షడ్గుణైశ్వర్య సంపత్తికి సన్నిహితమగుటకవకాశము కలిగినది. 'రామ' పదమందుగల రేఫము, వాచ్యవాచక భేదముచే పరబ్రహ్మ స్థానమందుకోగలదు 'ర' కారములోని 'అ' కారము జీవరూపము 'మ'కారములోని 'అ'కారము మహానాదరూపము. మరియొక 'అ' కారము స్వరరూపము. వ్యంజనము కానిది బిందు స్వరూపము ఇది ప్రణవ మాయలకు హేతుభూతమైనది మరణశయ్యపై చేరిన వ్యాధిగ్రస్తులు సైతము ఉచ్ఛ్వాసంతో 'రా' నిశ్వాసంతో 'మ' భావన అనుసంధానం చేయడానికి సులభసాధ్యమగుచున్నది. తద్వారా "పెదవి కదలని చదువు చదివితే పదవి దొరకును" – రామనామమనే తత్వగీతము సార్థకమగుచున్నది

అక్షరాస్యులుగాని, నిరక్షరాస్యులుగాని సులభముగా ఉచ్చరించి, తరించడానికి రామనామం అత్యంత ఆచరణీయం ○